# రాయలు

( నాటకము )



దరిమడుగు కామయ్య

సాగర లహరీ సలిల సమాన స
మస్త హృదిస్థ, నమస్తే
గ్రహతారాన్విత ఖగోళ సువిదిత
మహిమోల్లసిత, నమస్తే.

అల్లసానివారి యల్లుండ వైనావు
నందివారి వియ్య మందినావు
మనుమరాలి గోరి మారాము సేయవే
'కృతి' యిదెవరి కీయ? గృష్ణరాయ.

# రా యు లు

## ప్రథమాంకము
## ప్రథమరంగము.

స్థలము—కొండవీడు.

ప్రవేశము: రాయులు చిత్రపటమున కెదుట ఆటుమటలి నిలిచి తదేకదృష్టితో పరికించుచుండును. ప్రవేశించుచునే తిమ్మరును అదిచూచి ప్రక్కకొదుగుచు తనరాక తెలియనియ్యకు మన్నట్లు అచటి ద్వారపాలకునకు చేసైగతో తెలుపును.

రాయలు:

(అట్టేచూచుచు) కటకరాట్కన్య అనుటెల్ల నటుంచి,

జగతి నిటువంటిపతి నిజముగనెయుండి
అజునిదే యగ్రతాంబూల మనగవలెనొ
అజునిచేగాని యిట్టి రమ్యంపు సృష్టి
కేవలము చిత్రకారునిదై వెలసెనొ!

విద్యావతి యనియు వినుచున్నాము. ఎందుకైనను అతని కంఠముపట్టుగా కటకము పట్టిననేగాని ఈకొండవీట కూర్చుండిన నేమిలాభము. ( తిరిగిచూచి చకితుడై ఎదురు వచ్చుచు ) అప్పాజీ, కట కమువఱకును ఈజైత్రయాత్ర సాగింపవలసినట్లే. మీకిది యెంత కష్టకరమైనను నాయభిప్రాయము మార్చుకోలేను.

తిమ్మరుసు:

( మూడువతు అడుగిడుచు ) నిన్నటికి మార్చుకొనియు నేటికి మఱల ఇట్లనుటకు నాకు కోపముగాదు. నవ్వువచ్చుచున్నది. దొర లెట్లైన నిరంకుశులుగదా. అయినను ఎందుకులెమ్ము. ముందు నేనా కటకమువెళ్లి అంతఃపురవాతావరణముతోబాటు అచటి లోతు పాతులు గమనించి వచ్చెదను. ఆ గజరాట్కుమారులు మన కెట్టును ఈ దుర్గమున బందీలైనందుకు వీలుండి పరిస్థితు లొకింత పాటునబడెనా—అవతల దండయాత్రలతో మాత్రము ఏమంతపని.

రాయలు:

(దరస్మితుఁడై ) క్రొత్తపోకడలుగా నున్నవి!

తిమ్మరుసు:

ఔను. సంగతులు క్రొత్తవైనపుడు అవిమాత్రము క్రొత్తలు గావద్దా?

రాయలు:

చిత్రములుగానే యున్నవే ఈసంగతులును! ( చిత్రాంగదావ-వరిగిన చూడ్కులు మఱల్చుచు చిఱునగవుతో ) అయినను స్వయముగానే? మీరెట్లుపోవుదురు?

తిమ్మరుసు:

నేను గానట్లే.

రాయలు:

అటులైన నేనును వచ్చెదను. అప్పాజీ, ఆ రాజకుమారిదని

చెప్పబడు ఈ చిత్తరువు సంగతియు నాకొక సమస్యయే అయినది. (తెచ్చి చేతికిచ్చును) చూడుడు. అపురూపమైన ఈ రూపరమణీ యత స్వతఃసిద్ధముగా కన్యదైయుండునో కాకున్న చిత్రకారుని చేతిదే యగునో!

తిమ్మరుసు:

దేనిదైయున్న నేమాయెగాని నీరాకమాత్రము నాకుజూడ పొసగునదిగా తోపదు.

రాయలు:

లేదు వచ్చెద నప్పాజీ! నా యీ కోర్కెని మన్నింపుడు.

తిమ్మరుసు:

(స్వగతము) ఎట్లొకో యీబెడద. (ప్రకాశముగా)

ఎప్పుడుఁ బాఱుఁగొడ్డమగు నిట్టి వేడ్కలు నీకు యుద్ధమం
దిప్పగిదిన్ హుటాహుటి యెటేఁయు శోభిలుగాఁక లాతిచో
నొప్పునటయ్య, అట్లని యహో! షడీ కోఁకకోర కీవు న
న్నిప్పటి కిట్లుగోర నిది యేమని నేనుగ దోఁసపుచ్చెదన్.

హెచ్చరికతో మెలగనేర్చిన నీరాకచే కొంత మేలుగూడ లేకపోదు. కాని, తప్పిమెలగిన ఎంత కీడు రాగలదో అది యూహింపుము. వేషము మార్చెదవుగాని దేదీప్యమానమైన ఆ మూర్తి మహిమ నెక్కడదాచగలవు. మసిపాతచుట్టిన మాణిక్యము మఱింతగ మెఱయునేమో. అందును కానివారి కానిమాటలు ఎన్నిరకములో కావచ్చును. లేనిపోని చిక్కులున్నవి. (నేలజూచు పరిశీలించును)

సేవకుడుః

( ద్వారమున నే ప్రణమిల్లి లేచి ) దర్శనార్థము వచ్చిన ఈ ప్రాంతపు కవీశ్వరులట. దేవర సెలవైనచో ప్రవేశపెట్టెదను.

రాయలుః

అక్కఱలేదు. మేమే అట వచ్చుచున్నారము. ( తిమ్మరుసు దెసజూచి ) మీ రెట్లుచెప్పిన అటే మెలగుదును. అట్లని వలదని చెప్పినమాత్రము అగనప్పాజీ. (సేవకుడు వెంటరాగా నిష్క్రమించును.)

తిమ్మరుసుః

తీర్పలేనా నా రాయల యీపాటికోర్కెని—తీర్చి, చేర్పలేనా ఈ ఫణిఫణాగ్ర రత్నమును మా మలయకూట ప్రాసాదమున. శత్రు విప్పటికి ఱేపటికి నజేయుడే కావచ్చును. ఒప్పిచేసిననే అగుపను లిట్టివి కావచ్చును. అసాధ్యము లగువానిని సాధించినదిగదా పురుషప్రజ్ఞ. అమాత్య రాక్షసుచే చంద్రగుప్తుని కొలిపింపబట్టి గదా చాణక్యుడు చరితార్థుడు. కానిమ్ము. చేజిక్కిన రాచబిడ్డ లున్నారు. పైన దైవమున్నది. ఆ సంగతి మఱల చూచెదము. ఇపుడీమెట్టు దాటినగదా. ఏదోయొక నెపమున అంతఃపురము ప్రవేశించెదముపో. ఇతరేతరోద్దేశ్యములున్నచో వారినెట్టు త్రోవకు తేవలెనో! తెచ్చునంత పుణ్యము— అట్లు తెచ్చుటలో ఈ యుచ్ఛృంఖలు బెట్టుకొని ఎట్టు బయల్పడకుందువో. ఏదెటులున్నను మేమా యంతఃపురము వెలువడువెంటనే ప్రవేశపడగలిగి, కొంతకాలయాపన మగులాగున వారి యవధానము నాకర్షించు వానిని ఒక్కని నచట వేచియుండ జూచెదను. ఎవరున్నారొకో ఇందుకు సమర్థులు. పసివాడైనను రామలింగకవియాయెనా — మేము చేయలేకచిక్కిన మాపనియు నెరవేర్చి రావచ్చుమఱి. ( నిష్క్రమించును )

తెరవాలును

# ద్వితీయరంగము



స్థలము—కటకము.

**ప్రవేశము : తోరణగండ్లకడ నిలబడి చూచుచు రాణి భానుమతియు రాజకుమారి రుచీదేవియును.**

**భానుమతి:**

ముందువచ్చు వయోవృద్ధుడు కాబోలు గురువు! బృహస్పతిని పొడిచి పుట్టడుగా!!

**రుచీదేవి:**

శిష్యుని చూడ నున్నవే కన్నులు! ఆ వరుసకు బ్రాహ్మణ వేషమున మహేంద్రుడే కావలయును. మొత్తముమీద దైవజ్ఞులు కాదు జననీ, దైవమే యీ రూపమున మనకు ప్రసన్నమనుము.

**భానుమతి:**

ఏమిదైవమో, నా కడుపున చిచ్చుపెట్టి కూర్చున్నది. ( **కూర్చుండుచు** ) ఏడవచ్చి పడినాడు— **ఈ** రాయడు మాకు— ఆ కొండవీటికి. ఘడుచెట్టు ప్రబలమందురు, ఇట్టిదేకాబోలు!

కలనంగూరురులు రెడ్డివీరులొకవంకజా బైన దిగ్దంతు లు
త్కళ సామంతులు నిండఱుంగలిగి యింతల్ వింతలే కోట దా
యలదై యేదెటు కొల్లవోయినను వంశాధారసర్వస్వమూ
ర్తులు ముగ్గుర్ మగమొల్క బిడ్డలను తోత్తే బందెలంబోదురే!

ఎట్లున్నదో ఇక వారి భవిష్యము. పేరుమ్రోగు ఈ జోస్యులును సగము మనకొఱకే కాబోలు నన్నట్లుండదే సమయానకు

(కళావతివెంట గురుశిష్యులు ప్రవేశింతురు.)

భానుమతిః

(లేచి) ఆర్యులకు స్వాగతము.

గురువుః

సౌభాగ్య సిద్ధిరస్తు. ఇతోధికశ్రేయఃప్రాప్తిరస్తు.

శిష్యుడుః

మహారాణులకు మా యభివాదనము.

కళావతిః

ఆర్యులు ఈ యాసనము లలంకరింపవచ్చును.

(అందరు నాసీనులగుదురు.)

కళావతిః

( రుచీదేవిచెంత చేరుకొని ) జోస్యులవారికి రాజకుమారి నమస్కరించుచున్నది.

గురువుః

శుభమస్తు. తెలుపకయే తెలిసె. తెలిసికోగలవారికి ఆముఖలక్షణము లిట్టివి యెన్నిగొప్పసంగతులు తెలుపవు.

శిష్యుడుః

మమ్ములను నుద్దేశించి కాదుగదా.

గురువు:

కొనితెచ్చుకొను రకమిది: ఏదీ, ఐనను ఆలోచన చేసిచూడు. నేర్చిన విద్యలకు ఇట్టివే మఱి పరీక్షలు.

కళావతి:

ఆయనగారు ఆలోచించులోపల ఆర్యుల నొక్కటి యడిగెదను. కొండవీట పగవారి చేజిక్కిన రాచబిడ్డల భవిష్యత్తును గుఱించియే రాణిగారికి నిరంతర విచారము.

గురువు:

అయ్యో. ఎన్నాళ్లైనది?

కళావతి:

వార మింకను వెళ్లలేదుబాబు.

భానుమతి:

దుష్కాలము గాకున్న ఇక్కడి వారక్కడికి అందుకొనులోపలనే అంత తాఱుమాఱా జ్యోతిషప్రవరా, పగవాని పాల నింకను ప్రాణములతో నుందురా అని యెప్పటి కప్పటికే మాబెంగ.

గురువు:

(కళావతివైపుచూచి) నామధేయములు?

కళావతి:

వీరరుద్రగజపతి, కుమారరుద్రగజపతి.

గురువు:

ఏ ప్రాయపువారో?

కళావతి:

యువరాజావారి కిర్వదవయేడు. పిన్నబ్బాయిగారికేమో పదు నాలుగు వచ్చియుండును.

గురువు:

రెండంకెలు రాణిగారు స్వయముగనే కోరవలయును.

భానుమతి:

ఆఱు, మూడు.

గురువు:

కానే యైనవే ఆఱుమూళ్లు! (ఇంచుకతడవు గుణించుకొని) ఒకవిధమున జూచిన భయము లేదనవలసినదేలెండు. గురు డొక వంక కూర్చువాడైనాడు. ఇనుడు ప్రసన్నుడు కాకపోలేదు. బుధ సంసర్గముచే ఇటుమీదట కుజదృష్టియు మాఱకతీరదు. కాబట్టి పుత్రుల బడయుటయో లేక శత్రుల నణచుటయో గాని సత్ఫలిత మొక్కటి అవశ్యమున్నది. అయినను ఇందొక్కటి ఫలించిన రెండ వది వికటించి తీరును.

భానుమతి:

(నిట్టూర్చి) ద్వంద్వార్థముగానే చెప్పితిరి.

గురువు:

ప్రశ్నఫల మెటుదిరిగి శుభాంత మనియే మా సిద్ధాంతము. (శిష్యునివైపుజూచి) నీ సాముద్రిక మెంతవరకు నడిచినది?

శిష్యుడు:

హస్తము చూచిననే........ (చేతులు నలుపుకొనును)

కళావతి:

శిష్యులవారి సంగతి చిదంబర రహస్యమైనది. గురువులైన తీర్పరా మా కొఱత?

గురువు:

తీర్ప కేడపోయితిమి. అయినను నేను తీర్చునదేమి లెండు. మనయందఱి కొఱతలు ఎట్టును దీర్ప నీమెయే యున్నది.

ఆ కన్నుంగవ, ఆ లలాటఫలకం, బారూప, మా లక్షణా
నీకంబుల్ మఱియేమి కావలయు క్షోణీమండలాఖండలుం
డై కొల్వుండెడు సావ్వభౌమునకు నిల్లాలై స్వచారిత్రచే
ఈ కన్యామణి వన్నెతేగలదు సుమ్మీ అమ్మహీనేతకున్

కళావతి:

మా సకియదిగాదు భాగ్యము–మాది. మఱి ఆ మా స్వాము లేవైపువారో, ఎటువంటివారో!

గురువు:

(శిష్యునిదెస కలవోకగా చూచుచు) ఇట్టివాడని ఎట్టు తెలుపుదుము. అయినను విలక్షణమైన లక్షణా లొకటిరెండు లేకపోలేదు.

కత్తి చేపట్టనీ కలమే ధరింపనీ
ఎదురులేని విధాన బొదలువాడు
కదనరంగమున వాఙ్మయరంగమున నేమి
గడుసైన వింత పోకడలవాడు
దిగ్జయశ్రీలతో దివ్యకావ్యకుమారి
కలతోడ నిరుగేల గలుపువాడు
నిఖిలదిక్సామంత నృపసంతతులతోడి
కవిపండితుల యోలగంబువాడు

విక్రమార్కున కెనవచ్చు వీరగుణము
హర్షుతో భోజుతో సరియగు తనజ్ఞ
తాగుణము గల్గు రాజమార్తాండుడమ్మ
ఈ వధూరత్నము పరిగ్రహించువాడు

కళావతి:

విన వేడుకగా నున్నదేగాని ఇంత వింతయునే! (మూర్కొన తెరిచుకును.)

గురువు:

వింత కాబనిలేదు. ఇట్టి చాయలు నే జూచినంతలో విజయ నగరాధీశుని వంటివారియందు ఉండనే యున్నవి.

కళావతి:

గజపతుల కాతడు గర్భశత్రువు. కాగా, ఇక దివినుండి దిగివచ్చిన దెవరు?

గురువు:

యుద్ధ శిబిరములు వియ్యపువిడుదులుగా మార్చు విధివిలాసములు నీవేమెఱుగుదువు.

భానుమతి.

విధి కిదియేనా పని ?

ఇట బొడిచివచ్చు భానుం
డట బొడిచియు పచ్చుగాక అవురా! అట్లె
ప్పటికిం దలపకు; దయువా
రెటు పారపడినను అమాసయే పొరపడుటల్

పరాక్రమ మంత గొడ్డువోవుచో కొడుకు లటు కూలిపోదురుగాక. విశుద్ధ క్షత్రియాన్వయ జాతులగు గజపతులు ఒక కులాధము చుట్టఱిక మెట్లుచేయుదురని?

శిష్యుడు:

ఏమీ-(మొగము జేవురింప ఉఱిమిచూచి) ఎవడూ కులాధముడు?

గురువు:

ఎవడా? ఎవ్వడుగాదు నీవే. మఱి కాకున్న బాపనపుట్టువెత్తి నీకెందుకింత తలబిరుసు. ఏమి లేకున్నను ముక్కోప మిడిమాత్ర మున్నది. (చివాలున లేచి) వైరిపై గల కోపము మేరకు వేయి పల్కుదురుగాక. ఆసెగ మనకుదగిలి ఈనాటికీ లాగున తిరస్కృతుల మైతిమిగాక. మన మింతట రాద్ధాంతమునకు దిగకున్న ఆయన కులీనతకా లేక మన ప్రతిష్ఠకా లోటు? అగుసప్పటికి చూచుకొందము పద — (గురు. శిష్యులు నడచి పోవుదురు)

భానుమతి

(కన్ను గీటుచు) కళావతీ వారి నంత బెడుపుతో పోనిచ్చుట మనకుమాత్రము శ్రేయస్సటే?

కళావతి:

అదెట్లు పోగలరు. ఆపాటి చనవులేదా నాకు. (ముందుగు — పోయి ద్వారమున చేతులు బారగాపి అటుంకపఱచుచు) దౌర్జన్యమునకు రారుగదా యిక.

భానుమతి:

గబాలున దూరిపోయిన అపుడేమి చేయుదువు?

శిష్యుడు:

(ఆగి వెనుదిరిగి చూచుచు కోపముతో) చనవు పేరుతో ఇదిగాదా దౌర్జన్యము.

గురువు:

ఈ దౌర్జన్యము ఏపేరుతోనో? నీతో వేగినవఱకు చాలు. కదలవేమిటి కింకను. (శిష్యుని నెట్టుకొనుచు కళావతిని దగ్గఱి) నీకు నమస్కరింతు పోనిత్తువు. (నమస్కరించును.)

కళావతి:

మీకు నమస్కరింతు క్షణ మాగుదురు. (ఇట్లనుచో వల క్రోధోన్మాదియైన గురునిచే నెట్టబడిన శిష్యుడు తనమీదుగా చొరబడిపోగా కంగారుపడియు వెంటనే పళ్ళ బారచాపి గురువుతో) నీ వెటు పోవునది నే జూడబోనా?

గురువు:

మాబోటి బాపనయ్యలు ఎటు వోదు రన్నది యెంత గొప్ప సమస్య. రాణిగారిక, నీకు బట్టిన వెఱ్ఱిగాకున్న. (చేతిక్రింద దూరిపోవును కళావతి రాసాగియు పళ్ళ ద్వారము పడిపోయిన తొంగిచూచును).

భానుమతి:

శిష్యుని విషయమే చెడగొట్టితివిగాని సమయస్ఫూర్తిగా జల్లెడపట్టు గదే నీ పన్నుగడ.

కళావతి:

(బిరబిర నవ్వుచు) కోప ప్రదర్శననెపమున గురుని దంత కంటెను పన్నుగడగానే ఉన్నది తల్లీ. నేను చెడగొట్టినది మాత్ర

మేపాటిది. మాటవాసికిని నమస్కారమని నేనొకవేళ అనకుంటి నిపో—నన్నతడు నెట్టుకొనిపోక మానుననియా మీ యూహ? కాకున్న అది కొంత మోటుగానే యుండెడిది. కాబట్టియే కాబోలు నాజూకుగా నమస్కార ప్రయోగము!

భానుమతి:

నిజమైనమాట. చేతిక్రింద దూరకుండ శిష్యుని దాటించుట కివి యన్నియు పన్నాగములుగానే యున్నవి. అస లారూపమేమి-అ బింకమేమి-కులాధము డెవడని గుర్తింపలేమి చూచుటేమి!

(తొందరగాని వచ్చినట్లు ఒక చెలికత్తెవెంట ఒక పురోహితుడు ప్రవేశించును.)

చెలికత్తె:

కొండవీటి పురోహితులవారు. రాచబిడ్డల వర్తమానమట. ఆత్రముతో రాసాగినందున సరాసరి తోడ్కొని వచ్చితిని.

(పురోహితుడు కేలుమోడ్చి నేల చూచుచు నిలబడును.)

భానుమతి.

(చకితయై) ఏమి సంగతి?

కళావతి.

జవాబు లేదేమి? ఎదురుచూచు కొలదిని ఏమయ్యా ఈ యన్యాయము!

పురోహితుడు

ఏమి చెప్పనో తెలెండు. (ఇంచుక తలయెత్తి) పగవారిబారి పడ్డది మొదలు ఆ రాచబిడ్డలు నోరుతెఱచిన పాపానపోలేదు. చెఱసాలలో

కలిసికోదలచి అదిపనిగా నేనా రాయలకడ చనవు సంపాదింప జూచితిని. ఆతడెంత సూరుడో అంతకంటెను సరసుడైనందున నా ప్రయత్నము త్వరలోనే ఫలించినది. పోయి చూతుగా—అప్పటికే స్పృహ తప్పియుండెను. (అంజలి నిలుపనీక్షి అట్లే యుండుటలాగున శిలైనకలువ అగియుండి) అట్లని దేవుని దయవలన మఱేమంత యుపద్రవము ఉండగూడదులెండు. ఏలయన నేను బయలుదేరుముందొకమాటవిన్నాను. రాయలవారు స్వయముగానే కలుగజేసికొని బంధుప్రీతితో నచ్చజెప్పి వారిపూనిక మఱల్చిరట. గుణ మెవ్వరిదైనను కొనియాడకెట్లుందుము.

రుచీదేవి:

మా గుండెలెట్లయిన కుదుట బెట్టితిరి.

భానుమతి:

అయిననేమి కళావతీ, మనమింతకు.........

పురోహితుడు:

రాణిగారి ధోరణియేమో మఱి మాకు బోధపడదుగాని రాజకుమారి హృదయమునమాత్రము కొంత కదలిక ఉన్నట్లేయున్నది. ఏదెటులున్నను సంధి పాసగించి వారి చెఱ వదలించు నావిధి నేను నిర్వర్తించెదను.

రుచీదేవి:

(కళావతిదరి బిన్న స్వరమెత్తి ఊఁ జూపుచు) మా ప్రార్థనగానైన ఈ సంధికార్యము సరిచేయవలెను.

(పురోహితుడు రాణిగారి వైపు జూచును)

భానుమతి:

పుచ్చుకొని తాము బయలుదేరవచ్చును.

పురోహితుడు:

చిత్తము. (తన్ను తోడ్తెచ్చిన చేటితో బాటు నిష్క్రమించును.)

కళావతి:

రాజకుమారికి అన్నదమ్ములయెడ నెంత ప్రేముడియైనది ఇప్పుడుగదా తెలిసివచ్చినది.

భానుమతి:

సుక్షత్రియుల యింటబుట్టి ఎవరియెడల మాత్ర మింత బేలతనమా. అవుగాని కళావతీ, చూచుచునే ఎంత జాగుజేసితిమి. నడుమ ఈ పురోహితు డొకడు మనకేడ దాపరించినాడు.

కళావతి:

నాకు జూడ వారు వారేతల్లీ. అ గురువే కావలయును తిమ్మరుసుమంత్రి.

రుచీదేవి:

ఎట్టెటూ! (నిష్క్రమింపబోవును.)

భానుమతి:

(విషాద సూచకముగా చప్పరించుచు) వంటింటి కుందేలు పోయెగదవే ప్రయత్నపడినమాత్రము చిక్కదురా మనకిప్పుడికను. అదికొంత నగుబాటుచేటేమో. ఐనను కంచుకిం బిల్చుకొని మాటాడుదము రా— (బయలుదేరును.)

కళావతి:

ఆ యాలోచన ముగియువేళకు అమడదూరాన వారుండెదరు. (కొంబడించి రాణితో కూటు నిష్క్రమించుచు.)

రుచీదేవి:

వారేయైన నిది మమ్ముల నవమానించినట్లుకాదా. అయిన నితడే యొకో......? కాగా నితడా మఱి యధమకులుడు! రాజకులంబెల్ల వెలిగింపగల యీస్ఫురన్మూర్తియు కులాధము డగుచో కులీను లెట్టివారు కావలెను. కాకున్నను మా జననికిగల సంకుచితాభిప్రాయమెఱుగమా. తద్భిన్నముగా ప్రస్తావన గనుక, అందును శత్రుసంబంధమాయెను - ఎటుపల్కిన పల్కినదేగదా యికామె.

ఇంతకు వారెనా. ఇంకను సందేహమా. తాను గాకున్న ఒక జోస్యుని యెదుటను వంచినతల యెత్తలేకుందునుగా! అందును వరునిచే జూడబడు వధువు ననుభావన యెంత ప్రయత్నించినను నన్నుండి వదలిదాయెను. "ఇట్టివాడని యెట్టుతెలుపుదుము?" అని వరుని గురించిన గురుని యుపక్రమణిక సరాసరి శిష్యుని జూపి చెప్పినట్లే యుండదా. "హస్తము చూచిననే ..." అను మున్నగు శిష్యుని అర్థోక్తులుగూడ నర్మగర్భముగా తమ్మొకవంక చాటుకొనుచందమేగదా. వేయేల.

ఆ మోమున కళాంశ మది చెప్పుకున్నదే
అపరభోజుడు తానటన్నదెల్ల
ఆ విగ్రహ విశేష మది తెల్పుకున్నదే
నిజ దిగ్విజేతృత్వ నిశితసరణి
ఆ చూపు-సంరంభ మది చాటుచుండదే
తన గోప్యమైన నిద్దంపు వలపు

ఆ మెలంగిన తెఱంగది వెల్లడింపదే
స్వీయ సంస్కృతి-సాంప్రదాయికతలు
హీనవేషముననె యిట్లున్నచో నింక
మణివిభూషణములు మకుట మమర
సింహపీఠిమీద జెలువారు చుండంగ
నధిపు వేషముననొ యరయదరమె.

దురదృష్టముగాకున్న వరుడా మేరువువలె ప్రార్థనీయుడు. ప్రస్తుత మీ వివాహమున కర్థమో-అంతకంటెను ప్రార్థనీయమగు యుద్ధవిరమణ. చెఱలోనున్న సోదరులతోబాటు మృత్యుముఖ మందున్న లక్షలాది మానవసోదరుల రక్షణ-ఇటు స్వార్థము-అటు పరార్థముగదా. భాగ్యమిట్టిదయ్యును కులతత్త్వముపేరుతో ఈ మూర్ఖత్వ మేమందుము. వ్యక్తిసంస్కృతి వంశాదికముపై గొంతవఱకు నాధారపడుటచే అదియు నొక యెన్నికలోనిదై యున్నదేగాని అట్లని ఉత్తమసంస్కృతితో నొప్పు ప్రతిభచే భాసిల్లు ప్రఖ్యాత పురుషులకై యెక్కడికులము-ఏటిమతము!

మొదటికి కారణమే యిది కానపుడు—తుదకిది యిట్లు పంతాలక్రిందికి పరిణమించినపుడు ఎట్లొకో యీామెతో వేగుదును. సిగ్గువిడిచి చెప్పిచూతునా. మా యభిప్రాయమునకైన మన్నన యుండదుగా? ఏమో, సందేహమే. సంధిపాసగింప బురోహితుని ప్రోత్సహించుపాటిదైన హారమిచ్చుట కీమె అప్పుడే దెప్పివిడిచినది.

కని పెంచినందు కిట్టివి
కని పెంచినగాదె కన్యకను అటు సావి
త్రిని జేసిన, నిటు నంయు
క్తను జేసిన నామె తల్లిదండ్రులె సూవే-

(తె ర వ్రా లు ను)

# ద్వితీయాంకము

స్థలము—కొండవీడు.

( ఏకాంత మందిరము ప్రవేశించుచు క్రోధరక్తాక్షుడై రాయలు )

రాయలు:

కులాధముడు! అఖర్వ మహిమాతిధూర్వహుండగు తుర్వసు వంశసంభవుండు, నాగమాంబా నరసరాణ్ణందనుడు, విజయనగర ప్రాజ్యసామ్రాజ్య సింహాసనాధ్యాసి (తలపంకించుచు) కృష్ణదేవరాయడుగా అధమకులుడు? నిజమే. ఇంతటిమాటవడియు తలవంచుకొని వచ్చిన ఈ రాయడుగాకున్న నింకెవ్వ డధమకులుడు? అఱునూఱైన నవతల చూతమని వెంటనేగదా ఖండించి యుండవలసినది.

కొడుకుల చెఱపట్టితినను కోపముపో అపె నట్లాడించినది. ఐనను అంత నిరాధారముగా ఎట్లొకో ఆరోపించెదరు! పగయున్న పగమాట లెన్నిలేవు. లేక, నన్నుగుఱించి వారి యభిప్రాయమే అట్టిదగునా. అట్లగుటకు కారణము? వాస్తవమా, వాస్తవము? అసంభవము. మఱి 'కానివారి కానిమాటలు వేయుండు' నని ఆదిలోనే అప్పాజి యనుట కాస్కారము? (బొమలు ముడివడ నాలోచించుచుండ తిమ్మరుసుమంత్రి ప్రవేశించును ఆయన అట్లువచ్చి తనప్రక్కన నిల్చు చెటి గియదు రాయలు అటుచూడడు )

తిమ్మరుసు:

ఆ నాటకము నీ వాడలేవన్న వినవైతివి. ప్రభుకుమారా, తుళువాన్వయముచే వెలయనున్న తెలుగు నేలది సుమీ ఈ యదృష్టము.

రాయలు:

కాదు. కళింగరాజు ... లేదులేదు. వారును వృథాగా పలికినదిలేదు.

తిమ్మరుసు:

మనలో న్యూనత లుండికాదు వా రట్లు పలుకనేర్చినది. అంతఃపురమున దుర్భ్రమ లిట్లుండుననియే 'కానివారి కానిమాటలు వేయుండు'నని మొదటనే చెప్పితిని. ఉన్నచో తొలగించి రావలె నను లక్ష్యముతోనే ఇంత చేసినందు కిట్లయినది.

రాయలు:

వెన్నా నేతి నిమ్మన్న నిచ్చునది సున్న. కాగా వారట్లు భావించుటకు, లేదా భ్రమించుటకే యుండదము - కారణమున్న దన్నమాట!

తిమ్మరుసు:

లేకపోలేదు. అపవాదమొకటి ఆధారము దొరకినదని అగడు చేయజూచు గజరాజుకృషి ఇట్లొక తనయింట మాత్రము చక్కగా ఫలించినది. అరచే యుద్ధమిడినపుడు ఎల్లవారికి గాకున్నను తన వఱకైన సూర్యుడు చాటుగా కెట్లుండును.

సపతులతోడ మాటవరుసన్ చదరంగపు జందెమొడ్డి ఓ
టువడిన అద్దివంగత యటుల్ నవుటాల కొకప్డు దాసియై
నవఱకు నిక్కమే; అయిన నాగమదేవియు పాగివంశ సం
భవతను కొలుపోవలసి వచ్చెనె ఆ యగ డింతదెచ్చునే.

బాంధవ్యబాహుళ్యముచే బలపడిపోదువని ఇంతచేసిన గజపతులకు తగినశాస్తి తగినవిధముగనే జరుగవలసియున్నది.

(విహ్వలుఁడై రాయలూరకుండును. రామరాజు ప్రవేశించియు చేసిన యడుగు వెన్కకు లాగును)

తిమ్మరుసు:

(పత్యడినిబట్టి ప్రక్కకుచూచి) ఎవరు, సేనానులా?

(తెరమఱుఁగున నుండియే 'చిత్తము' అని పలుకుచు రామరాజు మఱల ప్రవేశించి సార్వభౌము నుద్దేశించి వశవర్తుఁడై నిలబడును.)

తిమ్మరుసు:

నగరికడ విశేషములు లేవుగా? తోడ్తెచ్చిన సేన యేపాటిదో?

రామరాజు:

మహామంత్రులతోబుట్టువు గోవిందరాజు ఖడ్గముపట్టి నగర రక్షకుడైయుండ విశేషము లేమియుండగలవు. దాదాపుగా ఇప్పుడాయనపంపిన దండొక లక్షకున్నది.

రాయలు:

అహెూ. అప్పాజీ, మన మాశించిన దంతయు ఈసంఖ్యలో అర్ధము లేదాయెను. (కూర్చుండును.)

తిమ్మరుసు:

పంపగలిగినవఱకును అనిన మూలబలములతోబాటు గదలింపుమని వారియర్థమాయెను. మూడువైపుల మూడు సంద్రముల దాక తన యేల్బడి ఉన్నదనుటేగాని ఉత్తరపు సరిహద్దు ఆ రాజధానికి, తన్నానుకొనిపాఱు తుంగభద్రయే అని యతడెఱుగడటనా?

రామరాజు;

ఈ ప్రశ్న పుట్టునని అయన గ్రహింపకపోలేదు. ఇచ్చటి చింత మీకంత వలదనుటగా ఇటు విన్నవింపుమనిరి-అవధరింపుడు

తానటె సాళ్వతిమ్మవిభు తమ్ముడు వీటికి పూటకాపు; కా
గా నది కృష్ణరాయ రసికప్రభుపుంగవు రాజధాని; యె
వ్వానికి గుండెలుండు; పగవారటులుజ్జ చొరబాటిరేని వి
ద్యానగరంబునం బ్రజ నమస్తము రాణువ గాకపోయెనే.

(తిమ్మరుసు తలవంచుకొని పోవుచుండును.)

రాయలు;

(చిరునవ్వున లేచి) అప్పాజీ, (సేనానితో) మంచిది రామరాజా, వలయు సవరణలొనర్చి సిద్ధముగ నుండుడు. ఱేపటి ప్రభాతభేరీ రవముతో బాటు విజయదుందుభిధ్వని వెండియు విన్పింపవలయు, పొమ్ము—

రామరాజు;

అజ్ఞ— (నిష్క్రమించును.)

తిమ్మరుసు;

(వెనుకకు వచ్చుచు) కళ్లెము రవంత చిక్కబట్టకున్న గాదు—

రాయలు;

నిప్పంటింపబడిన తోకచిచ్చు ఎంతసేపో అగదు.

తిమ్మరుసు;

అడుగడుగునకు అతనికి స్థానబలమధికము. అనన్యలభ్యమై

అనిర్భేద్యమైన గజబల మాతనిది. మనకా—అశ్వబలమైన నంత గాలేదు. కేవల మీ చచ్చియు చావని కాల్బలములతో కదనము నకుజని?

రాయలు:

(తలపంకించుచు) చూచెదరుగదా. మఱి యెప్పుడో అనుటెట్లు?

ఆడరి కులీనుడైనది కులాధముడైనది చెప్ప చూప ని
ప్పుడె యెఱిగించెదఁ గజవిభుం దెగదున్మెద పత్తిరోడుతఁ
వెడలెదనెందు వెఁదగిలి వేటగ తద్రుధిరంపు జల్లులఁ
జిడజిడలాడు మేన తగ జేకొనెదన్ తుదకేమొ తత్సుతన్.

తిమ్మరుసు;

ఎక్కటి కయ్యమున అట్లొకవేళ దైవానుగ్రహముండి ఏ రభసపు గెలుపో పడసినను ఏమిప్రయోజనము. ఒక్కటి యడిగెదను. ప్రధానత: కన్య గైకొనుటయా లేక కసిదీర్చుకొనుటయా?

రాయలు;

ఇం దొకటి అప్రధానముగా ఏల తోచినది?

తిమ్మరుసు:

'ఒకటి' ప్రధానమగు టెప్పుడును అనివార్యమైనందున.

రాయలు;

రెండవది అప్పటికి 'సున్న' అన్నమాట! మీ రేమన్నను నా దృక్పథమున మాత్రము ఒకటికి పదిరెట్లు తూకము అదియేసుడీ.

తిమ్మరుసు:

కావచ్చును. కాని, అది మొదటిదగుచో దానిసంగతి యటుంచి ఈ యొకటికి సైతము పట్టులేదేమఱి.

నెత్తురు వాఱజేసి తరుణీమణి గైకొనవచ్చునంచు నీ
చిత్తములో దలంపకుము చిక్కుసమస్య లనేక ముండెడున్
మొత్తముమీద దిగ్విజయముల్ పదివే లదివేఱు కామినీ
చిత్తము గెల్వలే; రెఱిగిచేయుము, చేయకతప్పు దాజియున్.

రాయలు:

దౌర్బల్యము లిట్టివి నా దరిజేరకుండుగాక సిసలైన క్షత్రియకన్యల చిత్తముల నువ్వెత్తుగా చూఱగొను నవియును నిజముగ నకు రక్తపు టీతలతోడి అట్టిచేతలే యగునేమో.

(తిమ్మరుసు ఊరకుండును.)

రాయలు:

అమాత్యులు నిరుత్తరు లయిరేమి!

తిమ్మరుసు:

ఔను. ఉద్విగ్నస్థితిలో తన తే డున్నపుడు పదేపదే అడ్డమాడక ఆ విషయమంతట వదలివేయుటయే తగుతెఱగని అతడెఱుగును.

రాయలు:

ఏమైన నియ్యప్పరసకు—అట్లనుటకంటె ఈ సరస్వతీపత్నికు గజపతుల యింటదక్క మఱొక్కెడ జనింప తావు లేదాయెను.

తిమ్మరుసు:

స్వరతీవ్రత యొకింత తగ్గినట్లేయున్నది: మంత్రులపద్ధతి మంత్రమువలె నెట్లు పనిచేయునది నృపు లిపు డెఱుగుదు రను కొందును.

దిగిన పిదపనె సకలమ్ము దెలియుసుమ్ము
వినము వెన ముందునకు నెట్టి వెతలబెట్టి
అవలగాని సుధారాశి యందనీని
తులువ నలువయు నటుగాక కలదె వెలువ.

అయినను మీయట్టివారి నమ్మకముల చొప్పున అన్యత్ర కంటె ఆబిడ అచట జనించు టదిమేలుగదా.

రాయలు:

(తక్కువ నవ్వి) కానిత్తురు.

నిండు జగంబులో నిలువ నీడయులేని యభాగ్యునేని భూ
మండల మేలబెట్టెడు నమాత్యు లఖండులు దండ నండయై
కొండగనుండ మాకు సుధకుం గఱవా వెరవార దూరి తే
కుండెవరే విషంబునను యుక్తికి మించునె రిత్తయుగ్రతల్.

(తలవంచియున్న తిమ్మరుసును మెల్లమెల్ల వీక్షించుచును.)

రాయలు:

ఈ గజపతు లొకపట్టున లొంగి రాబోదురొకో. అట్లని తుది దాక పోరాటమే జరిగిన ఏ దెటులున్న రసాభాస మగునదియు నిజమే. వద్దనుచుండ వెంటబడ్డందుకు సాధ్యమగు వఱకును అపోహలైన తొలగింప నిచ్చితినా. కన్నియలో నాకుజూడ కన్పింప తున్నను పరిసర ప్రభావము బలీయము గాకెట్లుండును. మంచిది

రావుగాని గజపతీ, ననుమించిన ఱేడ వగుట కదిగదా మార్గము. (చిత్రపటము చేతికి తీసికొని అచటి యాసనమున కూర్చుండి) యథాతథంపు చిత్రమయ్యెను కొంత బాల్యపుదైన యిది ఇప్పటితన కెట్లు దీటు రాగలదు.

(తదేకదృష్టితో చూచుకొనుచుండును.
రామలింగకవి ప్రవేశించును.)

రామలింగకవి:

(దూరముననే ఆగి) నమోనమః.

రాయలు:

(ఉలిక్కిపడి చిత్రమును దాచుచు) రామలింగ కవులా? ఈ రాకకు విశేష ముండదుగదా.

రామలింగకవి:

దేవరవారి దిగ్విజయ దాహము తీఱలేదన్నదే విశేషము.

ప్రాంతము కన్నడంబు, మలయాళము, పాండ్యము, చోళ, మాంధ్రపుం
బ్రాంత సమేతమై తనరు పశ్చిమ దక్షిణ పూర్వ సాగరా
క్రాంత సమస్త నిస్తుల ధరాపతి వైతివి కృష్ణవేణి ప
ర్యంతము నీ ధరాధమణి కయ్యెది నిక్కము కృష్ణవేణిగాఁ.

ఆ నెత్తుటి కత్తి నీ కృష్ణలోనైన కడిగి శాంతింతు రనుకొంటిని.

రాయలు:

అదెట్లు?

తరతరంబులవారి కరుడుకట్టిన కడం
కగ జెలంగిన గద్దె ఘనతబెంప

తుంగభద్ర దరింప త్రుళ్ళునూపు తురుష్క
జవ విజృంభణ ప్రభంజన మొనర్ప
ఆంధ్ర కన్నడులద్రై యలరారు కర్ణాట
క పతాక యిల నలుగడ నెగుర్ప
అవని పుట్టిననాటి హైందవ సామ్రాజ్య
మంతరింపకయుండ సంతరింప

దీక్షతో గొట్టుకాడు మా దిగ్జిగీష
ఎక్కడకు తీఱగల; దది యెట్టులున్న
గజపతియె మాకు నరిగాపు గాకయున్న
కటకపురి పట్టుకొనకున్న గలదె శాంతి.

రామలింగకవి:

అది నిజములెండు. కటకము ద్రొక్కనిదే ఎవరికిమాత్ర మెక్కడిది శాంతి. అందును జోస్యములు సైత మట్లే చెప్పు చుండెను.

రాయలు:

ఊరకొందురా వికట కవులు.

రామలింగకవి:

జోస్య మడుగుటయు చోద్యమే యాయె. అమాత్యసమేత ముగా సింహాద్రికని కాబోలు తామటు వెడలుచుంటిరి. నే నిటు కటకముదాక తగిలివచ్చితిని.

రాయలు:

ఎక్కడి కటకము!—ఏమి జోస్యము!

రామలింగకవి:

కటకమేమిటి— కాశికి పోనా వారికోసము, వారు నన్నింకను

అట్టే యెఱుగరు గాని నేను వారి నెఱుగక పోవుటేమి!

రాయలు;

వారు, వా రందువు– ఎందఱా జోస్యులు?

రామలింగకవి;

గురుశిష్యు లిద్దఱైయే అడ్డమైనదెల్ల దూరి యొకడు దూర కొకడు తప్పించుకొనిరిగాక మూడవవాడున్న మురిగిచావడా!

రాయలు;

(తక్కున నవ్వి) అంతఃపురము వెలువడి వచ్చునపుడు మా కెదురైనది నీవుగానే నాకొక అనుమాన ముండెను. అప్పాజి పను పున నరిగితివి గాబోలు. మనకిక మఱుగెందుకుగాని పోయి సాధించిన ప్రయోజన మేమిటి? అచ్చటి విశేషము లేవో అదిచెప్పు ముందు.

రామలింగకవి:

ఔలెండు. తక్కిన సంగతులు తమకెందుకు గాని రాజ కుమారికడనే నా పాత్రయు రక్తిగట్టినది. సంధిపేరుపెట్టి నేను చేయు కృషికి నాకామె ఆపేరుతోనే ఈ బహుమతియు నిచ్చినది.

(హారము చూపును)

రాయలు:

(ఆత్రముతో లాగుకొని విస్మయముతో) ప్రేమయా? తనకును నాపై బ్రేమ! కోరవేమిటికి—ఏమి కోరెదవో కోరు.

రామలింగకవి:

ఇచ్చి తాము వైదొలగు నట్లున్నది.

రాయలు;

నిస్సందేహముగా. ఏటి రాజ్యముగాని అటులైన జోస్యుల మగు మా సమక్షమున తనతల్లి వితండవాదము చూచాయగానైన ఖండించి మాటాడదా. అవుగాని తా నిది నీకిచ్చునపు డచ్చట రాణి లేదా?

రామలింగకవి;

ఉన్నది.

రాయలు;

ఉండి యిందుపై ఆమె యేమియు అన్నదిలేదా?

రామలింగకవి;

లేదు. నడుమ ఉరిశిక్ష నాకుండదుగదా.

రాయలు;

పోనీ. అపవాద విషయ మేమైన వచ్చెనా చర్చకు?–

రామలింగకవి:

మాటలు బొత్తిగా మాఱి పోసాగినవి.

రాయలు;

మఱి సరిపోయె. నమ్మకపోవుట అటుంచి మీదుమిక్కిలి మఱొక విధముగా అనుమానింపవలసి వచ్చుచున్నదిగూడ.

రామలింగకవి;

అవు నది యట్లే.

అలవియుగాక పచ్చి చెడి యైననె కాని యమూల్య వస్తువుల్
సులువుగ లభ్యమౌనెడను చూఱగొనందరమే నరేంద్ర, శం
కలు విపరీత మిట్లయగు కష్టముమీదనె లెస్సలెండు నీ
డలసుఖ మెండబాధ నొకటఁ జవిచూచిన పిమ్మటంగదా.

రాయలు;

జరిగిన సంవాదము జరిగినట్లయిన చెప్పుముమఱి.

రామలింగకవి;

చెప్పనే పనిలేదు. నమ్మకున్న నష్టముగూడ లేదు. ఎట్టును కటకము త్రొక్కకమానరు. నా హారము నాకు పాఱవేయుదురు.

రాయలు;

నీవు చెప్పినంత నిజమేయైన నీ చేసిన కృషికి నీ హారము నీ కిచ్చుటయా? ఇంతకంటె ననుచిత ముండదు.

రామలింగకవి:

నే నెఱుగుదును. నన్నైన ఇంతట వదలివేయుడు మహా ప్రభో—　　　　(నిష్క్రమించుచు)

రాయలు;

ఏమి యీచిత్రము!

తలిదండ్రుల్ మము అట్టుసేయుచును బద్ధద్వేషులైయుండి యీ
లలనారత్నము తాను నన్ వలచు టెల్లన్ నిక్కమౌనేని అ
వ్వల నుద్వాహ మెటున్న ధన్యమిటు మద్వంశంబునుం గాదె జ
న్మలు వేయెత్తిన నేమి మర్త్యులకు దాంపత్యంబు లిట్లొప్పినన్.

(హారము ధరింపసాగును.)

(తెర వ్రాలును.)

# తృతీయాంకము

## ప్రథమరంగము.

### స్థలము—కటకము.

(ప్రవేశము. ఆలోచనా నిమగ్నులై గజపతియు ఆయన మంత్రియు కూర్చుండి యుందురు.)

మంత్రి:

సాగి రానిచ్చుటే మంచిదని నా యభిప్రాయము ప్రభూ, ఆ యున్ముఖత జూచిన అతడెంత వఱకైన వచ్చువాడుగానే యున్నది.

గజపతి:

(**తలపంకించుచు**) మొదలు మన మట్లు వెన్కకు రావలసినదే కాదు. కోటపోయినదన్నను పోయి పడియుండ వలసినది. ఎట్టును గజబలములనెల్ల తరలించుకొనియే వెళ్లితిమిగదా. సదమద మొనర్పమైతిమా. మన రాజ్యలక్ష్మికి కటకమెంత తలవంటి దైనను గుండెగదా ఆ కొండవీడు!

మంత్రి:

అట్టి కొండవీటితోబాటు కొడుకుగుబ్బల నిద్దఱ గోల్పోయియు క్రుంగిపోని దేవరగుండెగదా నిజమునకు గుండె. కాగా, అట్లు జరుగుటకంటె శత్రువిప్పుడు ఎగబ్రాకివచ్చుటిది మేలుగదా.

(త్రిక్కటు చూచి) సామంత ప్రభువులును వచ్చుచున్నారు. ఒక నిశ్చితాభిప్రాయమున కిప్పుడే వచ్చుట మంచిది. (**లేచి వారి కెదురు వచ్చును. ప్రవేశించిన సామంతు లిద్దఱును ఆగి, గజపతికి కైమోడ్తురు. మంత్రియును వారి నిరుగేల కౌగలించుకొనుచు తోడ్తెచ్చి ఉచితాన నాసీనుల గావించును**)

గజపతి;

కొండవీటి కోట పోవుటకంటె కసవాపాత్రుడు మడిసెనన్నదే నా కెక్కువ కష్టకరమైన వార్తగానుండెను. ప్రాణములొడ్డి పోరాడియు, ప్రాతినిధ్యములు వహించియు పాత్రప్రముఖుల రైన మీరుండిగదా మహానది మొదలు పినాకిని పర్యంతము మేమింత భూభాగము పరిపాలింప గలిగితిమి.

ఒక సామంతరాజు;

మా బిరుదు లిప్పుడు మాసిపోయినట్లయినది. కాకున్న ఒక డీలాగున ఎగబడి వచ్చువాడా.

2 వ. సామంతరాజు

ప్రభువర్యు లేలనో ఇంకను ఉపేక్షించుచున్నారు. క్రొవ్విన కేతన బొరియలో నిలువని ఆ యెంగ్రడికి గజబల మెట్టిదియో ఒక్కట చవిచూపిన నింతవఱకు వచ్చెడిదా?

గజపతి;

నిజము నీవన్నది. అయినదేదో అయెను. ఇపుడీ యమాత్యులవారి యుద్దేశ్యము అరయక పోరాదే.

మంత్రి:

దిగ్విజయములొనర్చి కృష్ణ కావలిసమస్త భూములకు

ఏలికయైన ఆ రాయల నిపుడంత ఆసదుగా తలంపను తగదు – కాని, కృష్ణదాటి అతడెంత చొరవగా రాసాగిన మనమంత కఱకుగా మనకసి తీర్చుకోగలము. కటకము వఱకును వచ్చునట్లు చేయుటయే ఇప్పటి మన రాజనీతిజ్ఞత. వీలైనవఱకు నింకను పలాయన నెపమున అయా దుర్గములనుండి సైన్యము వెనుకకు రప్పింపుడని నా మనవి.

గజపతి:

అది కళింగమొ లేక కర్ణాట మగునొ
ఒక్క సామ్రాజ్యమే యిక నున్న దనుడు
ఏదడి యటన్నదే మన మిపుడు పూను
పట్టుదల మీద నాధారపడు ననుండు.

కాబట్టి రానిండు. వచ్చి నగర సమీపమున శత్రుశిబిరములు సైత మేర్పడనిండు. అందాక ఓపిక పట్టవలసినదే. ఇక్కడి మన బలముల నన్నిటిని నగరద్వారమున మోహరింప జేసెదము. మీరును మీ మీ బలములతో సిద్ధముగ నుండుడు. వచ్చి, తల పడనిచ్చి నగరమున కెట్టును నలువైపులనున్న మీరు అంద ఱొక్కమొగి పైపాటున చుట్టుముట్టితిరేని నడుమ నల్లుల విధమున నల్చివేసెదము. (కోపోద్రిక్తుడై లేచును.)

(తెర వ్రాలును.)

# తృతీయాంకము

## ద్వితీయ రంగము.

స్థలము — కటకమున రాయల శిబిరతలము.

(కలము, కాగితము చేబూని తిమ్మరుసుమంత్రి ప్రవేశము)

తిమ్మరుసు:

గజబలముల పేరుచెప్పిన గజగజలాడ వలసినట్లున్నది. నడుమ నెచ్చటను పెద్దయెత్తున యుద్ధము జరుగనియ్యక తన బలములనెల్లను గజపతి ఇచ్చట కేంద్రీకరించి నట్లున్నది. పైగా, సామంతసేనలు ఏవైపుచూచిన కారుమేఘాలవలె క్రమ్ముకొని వచ్చుచున్నవి. గజపతి యొడ్డిన ఈ చక్రవ్యూహమునుండి వెనుకకు మఱలుటకును వీలులేదికను. అంతకంతకు ఆహారపదార్థములందు త్రోవలును బిగిసిపోవుచున్నవి. ( కలవరించుచు ) లోనికి రానిచ్చి మూసికొని వచ్చు బోనైనదిగా మాకు వీరి పన్నాగము! కడపటవచ్చి మాకీ కటకమున నెక్కడ కల్లమున్నదో!!

(కూర్చుండి లేఖ వ్రాయుచుండును. పెట్టెలెత్తుకొని నలుగురు సేవకులు ప్రవేశింతురు )

తిమ్మరుసు:

అట బెట్టి వెలుపల వేచియుండుడు. మేము పిల్చినపుడు మఱల వచ్చెదరు.

సేవకుడు:

చిత్తము. (పెట్టెలు క్రిందపెట్టి నిష్క్రమింతురు.)

తిమ్మరుసు:

(ఒక్కొక్కటి తెఱచి అందలి అమూల్యములైన రత్నాభరణములను పాఱబట్టి చూచుకొనుచు) ఎరవేసిన ఎత్తుకొనులాగున ఇట్లుండవద్దా. ఈపాటి కనుతగిలెడివి కాకున్న నెట్లు. (శేష నొకపెట్టెలోనిది మూసి ముద్రలు చేయసాగును: రామలింగకవి ప్రవేశించును)

రామలింగకవి:

జయము జయము మహామంత్రులకు.

తిమ్మరుసు:

నిరీక్షించుచుంటిమి రమ్ము. పరిస్థితి నీకును ఆకళింతకు వచ్చియుండును. విజయనగర సామ్రాజ్యము నిల్కడ కిది అగ్ని పరీక్షగా నున్నది. ససైన్యముగా సామంతులు చుట్టును చొచ్చు కొని వచ్చుచున్నారు. అది యట్లుండగనే;

సంచలనంబుగల్గె మనసైన్యములో రిపుమోహరంబు భే
దించు తెఱంగు దోపక; మదించిన దంతుల దెప్పరంబు గు
ర్తించిరి: యోహటించిరదె దీనికిదోడుగ పై జనంబు సం
ధించిరయేని తే దికను దింపుడుగల్లపు టాసయేనియుఃఙ్.

గజపతికిని రాయలకును కానున్న వియ్యమును గుఱించి ఈ సామంతప్రభువులు సంశయించులాగున నేనొక రహస్య ప్రచారము సైతము కావించి యుంటిని. తత్ఫలితముగా వారి గూఢచారులు ఇపు డందందు తిరుగాడు చున్నారు. నీవైనచో వారిని గమనింపగలవు. తటస్థపఱచుకొని వారితో మాటవరుసకు యుద్ధ విష

యము ప్రస్తావించి సంధికుదురు సూచన లున్నవనియు నడచు చున్న కాన్కలే అందుకు నిదర్శన మనియు చెప్పి కొంపోబడు చుండు ఈ పెట్టెలను చూపవలెను. కటకమున వసించు ఆంధ్రు డవైనందున నీకిది సంతోషదాయక మైన దని ఇది యది యేవదరి ఇన్నిటికిని ఆ గూఢచారుల దృష్టి యీ పెట్టెలపై బడునటు చేయ వలయును. నీ కిక చెప్పవలెనా. ( పెట్టెల నుద్దేశించి ) మన చారు లెక్కడ?

రామలింగకవి:

అప్పటికి ఎన్నవదో నాపాలిటి కీ యవతారము.

తిమ్మరుసు:

పది యవతారము లెత్తిన పాండురంగని నేమనవలెను. ఒక ప్రబంధమే వ్రాయవలెనో? నెమ్మదిగా కూర్చుండి అదియు చేయుదువు లెమ్ము. (చారులు ప్రవేశించి ప్రణమిల్లుదురు)

వినుడుమీరు గూఢచారులు. రాచనగళ్లకు కొంపోవువారివలె నటింపవలెను. సామంతుల గూఢచారులు మిమ్ముల ననుమా నించి తమ ప్రభువులయొద్దకు మిమ్ము మఱల్చుకొని పోవుదురు. అట్లు జరుగవలె ననియే మా అభిమతముగాని గజపతీంద్రుని నగరుచేరు టెంతమాత్రముగాదు. ఆ సామంతులు మిమ్మెంత క్రుచ్చిక్రుచ్చి అడిగినను మా పనుపుగా గజపతీంద్రుల పాలికి గొంపోవు చుంటిమనియే చెప్పవలెను. మఱి కైకొనుడు.

('చిత్తము' అని వణకుచు సేవకులు పెట్టె లెత్తుకొని నిష్క్రమింతురు.)

రామలింగకవి:

ప్రతిఫల మిమ్మనిన రాయలు మీకు ఏమిచ్చువాడో!

తిమ్మరుసు:

నా ప్రతిఫలము సంగతి ఎట్లున్నను నీకుమాత్రము ఇటువంటి కొంటెప్రశ్నలకు నూటికి మన్నన నేను చెప్పి చేయించెదను. సంఖ్య అంతకుమించెనా నావల్లగాదు. అది గుర్తించుకొనిమెలగు.
(ఇరువురు పక్కున నవ్వుదురు. వెలుపల నుచ్చైస్తుగా రొద లేచును.)
(తెలిసిపోయిన దంతదీప్తులు ఆక్షణముననే మఱల మఱుగుపడులాగున అదరి కడిచూచి) కకావికలగు మనవారి కేకలు కాబోలు. ప్రయోగము ఫలించువఱకైన......అయ్యో! ఫలించిమాత్రము ఈ పరిస్థితిలో నేమి ప్రయోజనము. లోకువ యేర్పడిన పిదప నెంతకైన లోకువయేగదా. (చారుడొకడు ప్రవేశించును.) కోలాహల మేమి టోయి?

చారుడు:

అవధరింపుడు. ఏనుగుల డాకకు వెన్నిచ్చిన మనమూకల కెగబడివచ్చి ' కుందేళ్లగొట్టి కూరకు పంపెదము ' అను గర్జాధ్వనితో ఖండించుకొనుచు సార్వభౌములొక మెఱుపువలె మెఱిసిరి. కొంతతడవట్లు తనవారనక చిత్రవధచేసి 'సింగములరై రండు' అను నెలుంగున అయ్యేనుంగులపై తమ తురంగమును కుప్పించి దుముకు ఱేనింగని మఱల నొక్కడు వెన్కడుగు వేసిన నొట్టు. అట్లు ఒక్కుమ్మడిగా ఎక్కుచను మనవారి జయజయారవమే ఆ కోలాహలము.

తిమ్మరుసు:

(రామలింగకవితో) చూచితివా. కృష్ణరాట్కేసరివంటి విక్రమశాలి జతపడబట్టిగదా నాబోంట్ల ధీశాలిత్వము రామలింగకవీ. మఱినీవు త్వరపడవలయును. త్వరపాటున పాడి పాఱకపోరాదని మఱల హెచ్చరికయు నవసరమే. (మూసిమూసి నగవులతో రామలింగకవి

నిష్క్రమించు చారునితో) నేనుమాత్రము ఇంకిట నెందులకు ఈ యూపుననే విజయమో వీరశయనమో పద— నా గుఱ్ఱమును సిద్ధపఱచి తెమ్మని అశ్వశిక్షకునకు చెప్పుము. నేను పోయి కవచాదులు ధరించుకొనుచుందును.

చారుడు:

చిత్తము. (నిష్క్రమించును)

తిమ్మరుసు:

(స్వగతము) అహో!

భయద భల్లూక ప్రపంచంబు దలపించు
మూలబలంబె యేమూల ననియు
పగఱగుండెలు బెండువడ మోహరించెడు
గజబలం బది యసంఖ్యాకమనియు
కటకంబులో చీమచిటుకన్న నటదేలు
పాత్ర సామంతులు పలువురనియు
స్థానబలంపు దక్షత నజేయుత నెప్డు
గజపతుల్ మకర నంకాసులనియు

జనపరంపరగా ననుకొను వదంతు
లొక్కటియు పొల్లువోకుండ నిక్కమయ్యె
ఇక పరాజయమ్మన్నది యెఱుగకున్న
రాయల నిదెట్లు గడవంగ జేయునొక్కొ.

ఉన్నాడులెమ్మా విరూపాక్షుడే— (నిష్క్రమించును)

(తెర వ్రాలును)

# తృతీయాంకము.

## తృతీయ రంగము.

(ముప్వురు సామంతులు ముచ్చటించుకొను చుందురు. చారు లిద్దఱు నలుగురు పెట్టెల మోపరులను వెంటబెట్టుకొని ప్రవేశింతురు.)

చారుడు:

క్షణములో తప్పగొట్టుకొను చుంటిమి. దైవికముగా తటస్థ పడ్డ ఒక బాపని పుణ్యమా అని జాడతీసి వీరినిట్లు......

1.వ సామంతుడు:

ఎవరుమీరు? అట బెట్టుడు.

1.వ మోపరి:

ఏమ్? (వంచి దిగుటబెట్టుచు) రాయల్‌వారి నవ్‌కర్లం.

2.వ సామంతుడు:

రాయల్‌వార్ సరేలే. పంపిన దెవరికి? మాకేగా.

2.వ మోపరి:

కాద్‌కాద్. గజపతుల్ లేదేమ్? పెబూల్.

3.వ మోపరి:

హుజూర్‌కి నజరానా మారాజ్.

3-వ సామంతుడు:

ఓహో. రాచనగళ్ల కన్నమాట!

3-వ మోపరి:

హౌ. (చారులజూపి) యీాల్ మాపాణాన్కి హెక్డా వొచ్చిండాడ్. మారాజ్. హాల్కింహైతో మాకీ సజా. (పెట్టె ఎత్తి[illegible]నపోగును.)

1-వ సామ-తుడు:

ఈ యొడుపు లిక్కడకాదు. అయినను నవాబుల పొత్తున్నదో మఱల రాయలకు!

3-వ మోపరి:

(ఎత్తినపెట్టె క్రింద దించిపెట్టుచు) హైతో క్యా మారాజ్. నమ్కమ్ హుండాడూ. అట్టాసూత్తే అసల్ నవాబుల్‌మాత్తరం? క్యా గుల్బర్గా, క్యా బిజాపుర్, క్యా గోల్కొండా— సోబ్ ఇన్కి ష్నేహం హుండాడ్నై? నమక్‌హారామీ మాదీకాద్. సూడ్‌మడీ. పాణం పొయ్నా వొదిల్‌పోతాడో యీాడ్.

1-వ సామంతుడు:

అచ్ఛా. మీకా భయమే వలదు. మాకివి వద్దనువద్దు. కాకున్న ఒక్కమాటు చూచికాని పోనియ్యము— (ముద్ర తగులగొట్టి పెట్టె తెఱచును.)

1-వ మోపరి:

పోయె ముద్దర్. ఇంగెవు రీసొత్తుల్‌కు జవాబ్‌దార్. గొప్పోల్‌కు ఇదా లాయక్. ఎంతన్నేయం!

2.వ సామంతుడు:

ఈ మాటతీరు తెలుపదా తురకాణ్యము పొత్తు తమ కెంతటి దైనది. పదాలు తెలుగువైనను తుదలెంత ఊది పల్కుదురో చూడు. (మఱొక చెక్కె కళింగొట్టపాగున)

 2.వ మోపరి:

సదివిన తెలుగై మీదట్టట్టావుండాది గాని యిక్కడోల్ల తెలుక్కంటే యికారాలో? తీపులమా త్తెలుగు, మొగశీ త్తెలుగే మాది పోతువ్.

3.వ సామంతుడు:

(కేఱొక చెక్కె తెలుగులుచుచూసి) ఇదిగోనయ్యో (బిరబిర శేఖ విప్పి చదువుకొని) మాటతీరు మఱల చూచెదము. ముందు ఈ తీరు చూడు మనవారిది. (బిగ్గరగ చదువును.) శ్రీమత్కటకేశ్వరులైన శ్రీ శ్రీ శ్రీ ప్రతాపరుద్ర గజపతి మహారాజులుంగారికి. విజయ నగర సార్వభౌము లంపిన లేఖాంశములు.

సామంతుల నందఱను పట్టియిచ్చు సంధి షరతునకు ఎట్టకేలకు మీరు సమ్మతించినందుకు సంతోషము. ఇక సంధిభద్రతకై అనుకొన్నసంగతి అది సరేసరి.

ఇట్లు,

మీ నెయ్యపు టల్లుడు,

కృష్ణదేవరాయలు.

2-వ సామంతుడు:

ఏమేమీ!— (కైదీని శిక్షా స్థానాలాగ్రహముగా చూచుచు)

1-వ సామంతుడు:

(గుండెలు గుద్దుకొనుచు) అమ్మమ్మ! ఎంతసాహసము!!

3 వ సామంతుడు:

(నివ్వెఱపాటుతో) వారు వీరను అనుకొనుచుండ అట్లుండునా అని నేను నమ్మనైతిని. కొడుకులు చెఱపడ్డది మొదలు అతడు మునుపటియతడు కాడు. అయినను తా జెడ్డకోతి వనమెల్ల చెఱుచునందురు — ఇట్టిదేగదా.

2-వ సామంతుడు:

(పెట్టెలమోపరుల నుద్దేశించి చూపుచు చారులతో) వీరిని మీ నిరీక్షలో నుంచుకొని తక్కిన సామంతులనెల్ల త్వరగా రంపని పోయి చెప్పుడు—పొండు.

చారులు:

చిత్తము—(తోడ్కొని నిష్క్రమింతురు)

2-వ సామంతుడు:

ఇక జరుగవలసిన దేమి? సేన లీపాటికి నగరి పొలిమేరలు తగిలియుండు నేమో.

1-వ సామంతుడు:

ముందు మన మన సేనలు వెన్కకు రావించి తర్వాత తక్కిన గొడవ లాలోచించెదము. పైగా, ఇంతట నున్నను మనకు ప్రమాదమే.

3-వ సామంతుడు:

తక్కినవారిని కలిసికొనుదాక మన మిచ్చటనే ఉండక తప్పదు. కాకున్న మన సైన్యములకు మాత్రము తత్‌క్షణమే వెన్కకు మఱలుమని ఉత్తరువులు పంపెదము.

2-వ సామంతుడు:

బయలుదేరునపుడు నాకైన శకునమునుబట్టి అనుమానము గానే యుండెను. కాని, అంతలోనే మంచి శకునముసైత మైనది గనుక రా సాహసించితిని. కాగా 'కీడులో మేలు' మఱి ఇట్టిదేగదా.

1-వ సామంతుడు:

మాఱువేషముతో అంతఃపురమునకు రాయల రాకపోక లున్నవను వార్త వినియు నా అవివేకము నే నేమందును.

3-వ సామంతుడు:

ముప్పు తప్పినప్పటి ముచ్చటలయో, ఇట్టివి! ముందు మన మెందు కింకను జాగుచేయు చున్నాము.

(అందఱు బయలుదేరుదురు.)

(తెర వ్రాలును)

# తృతీయాంకము

## చతుర్థ రంగము.

(నిట్టనిలువున చిట్టిన పెంగమముతో గజపతీంద్రుడు చలింపక వెలుగు అగ్నిజ్వాలవలె కనుపట్టును. ఉద్విగ్న చిత్తముతో ప్రత్యుత్తరమున కెదురు చూచువానివలె మంత్రి ఆయనప్రక్కన నిలబడియుండును)

గజపతిః

(ఉండియుండి) అహ్, కానిత్తురు. పుట్టిమునిగినను దిట్టలగువా రీదిపోగలరు. చచ్చిన బ్రతికిన పేరుండు ఘట్టము లిట్టివి.

మంత్రి

సాహసించుట కిది సమయముగాదు ప్రభూ. "సైన్యము తేలనో మఱల్చుచున్నారు. ఏమి దుష్కాలమో యెఱుగము" అని నేను వ్రాసిపంపిన యీ చీటిమీదనే ఆ సామంతు లిచ్చిన జవాబు వినుడు. (చీటి విప్పి) "ఈ పిఱికివారి నేదో బ్రతుకనిత్తుము. మాచే అపకీర్తిపాలైన కాలమునోదార్ప మీరే యున్నారు."(అని చదివి కలవర పడుచుచు) చూచితిరా—తంతుగా నుండదా యిది యంతయును.

(సేనాని ప్రవేశించి రాజునకు ప్రణమిల్లి దూరముననే ఆగును వెలుపల కోలాహలము వినిపించును)

మంత్రి

(చెవియొగ్గి వినుట నభినయించుచు) పాఱుకేకలుగా నున్నవి! సేనానీ, మనవారివే?

సేనాని

కాక?— ఇక వీరి నాప లేము.

గజపతి:

(కండ్లు మూయుచు) నా కెదురగువారి నెల్ల నణకుచు బోయిన గాని......(ఖడ్గము దూయుచు. సేనాని చెప్పనిదే యాలుకొనును)

మంత్రి:

(అడ్డపడి రాజుచేతులు పట్టుకొని) వైరులు పన్నిన వలలో వారెట్టును పడ్డారు. మీరిట్లు తెంపుచేయుటతోగాని మనము పడము సుడీ. ఉన్నట్లుండి అండదొలగినట్లయి ఆకులమందు ఈ కొలది మూకలతోనా ఇంకాతని జయించు నాశ? ప్రతిష్ఠకు పోరాడియా ప్రాణములు వీడుదము?

ఇదియా వీరత యిట్టిదే ఘనత యేమేఁ బోయి ఆ గోయి దూ
కుదుమే కుట్రలమారి శత్రువులకై కుట్రల్ సనుంగాని యి
ట్లెదురొడ్డం జనునయ్య? ఆతడును తానే సంధి కూరేగెడుం
గదవే, మంచిగనే ముగించెదము వేగఁ జేగి లేకుండగఁ.

గజపతి:

(కలవరించుచు) వారు కోరు షరతెఱిగియేనా తమ రుపన్య సించునది?

మంత్రి:

ఎందు కెఱుగను. కార్యసాధకు లిట్టివి లెక్కింపరు.

గజపతి:

లెక్కింపక, వీరేనా నేటి కింత నేర్చి బ్రతికినది. దాసీసుతు

డని ఒకనాటికి అగడు పలికిన మనమే నేటి కితనికి కన్యనిచ్చిన లోక మేమనును? కావలెనని గదా వారు అట్లు కోరుటయు.

మంత్రి

నిరర్థకమైన ఈ మాటపట్టింపులకేమి నరేంద్రా! చూచుచు పోయి గోతిలో పడుటకుమాత్రము లోకమేమనునో ఊహించితిరా. దెబ్బకుదెబ్బ చూపి ప్రక్కలో బల్లెము పాపికొనుటకు ఇది సుకర మైన మార్గమైనందుకు సంతోషింపక.

గజపతిః

(ఉల్కిపడి) ఏమి మీ యుద్దేశ్యము? అటులైన ఆమె గతి యేమికావలె నందువు.

మంత్రి

అట్టివి ఒరులు చెప్పగల పాటివికావు. తండ్రికై అపాటి త్యాగ మామెయు చేయవచ్చును.

గజపతిః

పెద్దవారలు గనుక మిమ్ము అనగూడదు! ఇక నా కెదురు తొలగితిరా సరి—లేదా (ఖడ్గము దూయును. రుచీదేవి ప్రవేశించును. ఉన్న వాడును తొలగినవాడును గా ఉండ అటునిటు గా మంత్రి యుండును.)

రుచీదేవి

దిగవిడిచి చని రటనే సామంతులు. ఎక్కడి మనవారు— ఎక్కడికి పెరవారు!

మంత్రి

నిజమైనమాట, (అందుకొని మజల ముందునకు వచ్చుచు) తనకు

సంబంధించిన ఈ సమస్యను పరిష్కరించుభారము ఒక తన మీదనే యుంచుచదము. ఏమి తల్లీ, సమయమునకు నీవును వచ్చితివి. రాయబార మిప్పుడే వచ్చిపోయినది. సంధి భద్రతకై నిన్ను ఆ రాయల కిచ్చి వివాహముచేయు టొక్కటియే వారు కోరెడు షరతు. ఇందులో నీ యభిప్రాయ మవసరము.

రుచీదేవి

మీ యభిప్రాయము— నాయనగారి యభిప్రాయము నొక్కటియు నాది మఱొక్కటియునా?

గజపతి:

ఈ సామంతులు శత్రువులతో చేరిరానిమ్ము. ఇట్టితంతులు వేయి జరుగనిమ్ము. విజయాశ లేనిపక్షమున వీరులవలె మరణింతము గాని ఏకైక ప్రియనందనయగు నీమె వియోగము నేనొక నాటికి సహింపనని ఇప్పటి కెన్నిమార్లు చెప్పితిని.

మంత్రి:

రాజనైతిక దృష్టికి ఈ ధీరత్వ మెంత అర్థములేని దనిపించునో సుతావియోగము సహింపరాని దనుటయు అంత అర్థము లేనిదే యని మఱియొకసారి —అనగా తుదిసారిగా మనవి చేయుచున్నాను.

రుచీదేవి:

ఏల, అంతగా నా వియోగము సహింపలేకుండు తండ్రిగారికై ఇంతకంటె నేనుమాత్రము అవివాహితగానే ఉండిపోలేనా-

(నిష్క్రమించును.)

గజపతి:

సాభిప్రాయముగా పలికినట్లున్నది-(కూర్చుండి ఆలోచించును.)

మంత్రి

ఇటీవలి అంతఃపుర వృత్తాంతము ఏలినవారి వఱకు రాలేదేమో కాని రాజకుమారిని చూడవచ్చినట్లు ఇద్దఱు జోస్యులను మానింపబడి నిపుణముగా తప్పించుకొని రట. విజయనగరపు దొరయు ప్రెగ్గడయు నని వారిద్దఱినిగుఱించి నగరులో గుజగుజలు గలవు.

గజపతి:

అటులైన మనమా ఇక నభ్యంతరము? పొండు. పోయి చక్కబెట్టుకొని రండు.

మంత్రి

అప్పటికిది...

గజపతి:

అప్పటికిదిలేదు—ఇప్పటికదిలేదు పోదురు.

మంత్రి

మీ యిష్టము—(నవ్వుచు పోవును)

గజపతి:

ఈ నీచు డెంతవఱకైన- ఔరా! నన్నేమిగా తలచినాడు. కుమార్తె దెస నింతటి క్రూరకర్మమొనర్చి శాశ్వతమైన అపకీర్తిని తలదాల్పవలెగా! ఇంతకు రానేవచ్చినపుడు ఈమె పెంపు నాదిగానే అనందింపరాదుగా!! (పాఱజూచి) ఎవడక్కడ?

(ద్వారపాలుడు ప్రవేశించి ప్రణమిల్లును)

గజపతి:

రాజుగారి నిటు రమ్మనవోయి.

దౌవారికుడు:

ఆజ్ఞ. (దౌవారికుడు నిష్క్రమించును)

గజపతి:

న్యూనతయా మాకిది? క్షత్రియుడనే యౌదుగాక—కన్న తండ్రిని కాకపోవలెనా. అతడింతకు శత్రువే కావచ్చును, సామంతు లిట్లగుటకు హేతు వాతని కుట్ర గావచ్చును— ఇట్టి కుట్రలుగాదా సాగిన పక్షమున అధిక్యము పేరుపెట్టి మేము మాత్రము చేయునది. ఇట్టి మోసముగాదా రాజకీయ పరిభాషలో నీతినిపుణతగా పేర్కొనబడునట్టిది. పరిణేతయైన పట్టమహిషిమ తల్లిని దాసీలలనగా మే మింతకు నగడుపఱుపలేదా— అంత కంటెను ఒకరికి చేయగల ద్రోహమనుచు వేఱొండుగలదా? ఇంతటనైనను ఈ కుటిలనీతికి స్వస్తిచెప్పుట మేలు. సామ్రాజ్య స్పర్ధ నింతటనైన ఉపసంహరించుకొనుట మంచిది. రాయబార మంపుచు అత డన్నట్లు విజాతీయ విరోధుల నెదుర్కొన వలసి యున్న హైందవులలో పరస్పరద్వేషము ఆత్మవిధ్వంసకమేకాదా. అటుచూచిన ఇపుడింతకు అతడుమాత్ర మితరు డెట్లాయెను. కన్యాదాన మతని కాళ్లుగడిగి కాకున్నను మన్మనః కశ్మలము గడిగి చేయుదుగాక.

హరిదంత ప్రభుకుంజరప్రకర సింహస్వప్నమై యింత న
చ్చరితుండై అభిజాతుడై నిజభుజాస్కంధాశ్రితాఖండరా
జ్వరముండై పరణీయ రూపవిభవుండౌ ఈతనిన్ మించి యొ
ప్పరి కిత్తున్ పగమీదబెట్టి ఇటు నిర్బంధించు నా భాగ్యమే.

(భానుమతీదేవి ప్రవేశించును.)

భానుమతి:

నాథా, ఏమి యీ ఉపద్రవము!

గజపతి:

దేవీ, ఊరడిల్లుము. రాయబారము జరుగుచున్నది. దగ్గర వారు దూరమైనందుకు దూరపువారైన దగ్గఱ గావద్దా.

భానుమతి:

రాజకీయపు టెత్తులు ఎన్నిరకములో కావచ్చును. చివర కెటువచ్చియు మన గౌరవము చెడకున్న సరిగదా- ఐనప్పటికిని తేటగా తెలియుదాక నా మనసు కుదుటబడునట్లు లేదు.

గజపతి:

అడుగకున్నను చెప్పుటకే పిలిపించినది. అరులవలె వచ్చి అల్లురైనవారు అరుదు.

భానుమతి:

అల్లుడు! ఇట్టిదియునా పరిహాసము?

గజపతి:

పరిహాసముల కిదియేనా సమయము?

భానుమతి:

నిజమా? నిజము? గంగలో త్రోయకపోయితిరా!

గజపతి:

వెఱ్ఱిదానా, దాసీసుతుడన్నది గట్టిగా పట్టుకొంటివి కాబోలు! కావలెనని మనముచేసిన అగడుసుమీ అది.

భానుమతి:

ఈ మాత్రమైన సమర్థించుకొనకున్న నెట్లు!

గజపతి:

నమ్మవో?

భానుమతి:

నన్నేనా లోకమునుగూడ నమ్మింప నుంటిరా?

గజపతి:

నీ కున్నంత మూర్ఖత లోకమునకున్న నిక నేమున్నది. అది మొదటికి నీవలె నెఱనమ్మియున్న దనుకొంటివా? కాదనిన, పోనీ, శూద్రులైనా డందువు. అంతేగదా నీ వ్యాఖ్య.

మురకు బుట్టిన చంద్రగుప్తునకు లేని
మాన్యతయె, నాటి కానీను మాట యేమి?
వెలమలును రెడ్లు కమ్మలు తెలగ లనగ
దొరలుగా రేటివార లాంధ్రులఁ బురంధ్రి!

నిజ మరసిన ఏ కాలమునను గుణమునకు లేని ప్రాముఖ్యము కులమున కేడనో ఏడ్చినది. కత్తి దొడ్డదికావలె గాని ఒరతో పనిలేదు. ఉన్న వాస్తవము ఊహింపగలిగినచో ఈ గొడవ లన్నిటితోను అంతకుముందే పనిలేదు!

భానుమతి:

పాలవంటి కులాన కెన్నిగతులు వచ్చినవి. రాజ్యమేలు వారిదెల్ల రాచకొలమైన నాయెగాక, వంశగౌరవమైన పాటింపకపోవలెనా. ఈ రాయబార మారంభమైయే కాబోలు కులీనులైన

సామంతులు ఎక్కడివా రక్కడ సర్దుకొన్నారు. దాసీపుత్రులెల్ల మీకు దైవస్వరూపులౌదురుగాక. నామేన ప్రాణముండ ఈమాదిరి జరుగజాలదు.

గజపతి:

( కన్నులెఱ్ఱబడ ) నీ వొకతెవు మానధనురాలవు. చెప్పినను తెలియ బనిలేదు. ఎంత కులోద్ధారకురాల వైతివి. మొదలీ విషయమున నీకు నాకు నేమి యధికారము. ఆచారమును బట్టియు స్వయంవర విధానము క్షత్రియకన్యలది. అదియైన గుర్తెఱుగ వలెను. (చివాలున లేచిపోవును)

భానుమతి:

( కనులనిండ నీరుగ్రమ్మ ) అబ్బపాలిటికి అవతారపురుషుడు. కూతున కేమో కుతూహలమే. పగవా డాతడు పట్టినది పంతమా. ఏ మొగము పెట్టుకొని యిక—ఇస్సీ! భానుమతీ, ఇంకను బ్రదికి యుంటివటే. (ఒడ్డాణము నందలి కత్తి లాగును. లటాలున కళావతి ప్రవేశించి ఆమె చేతులు పట్టుకొనును )

భానుమతి:

నాకు అడ్డురాకు చెలీ. నా ఆస వదలుము. ఈ కుమ్మ చూడకముందె దాటుకోనిమ్ము.

కళావతి:

చూచిననేమితల్లీ, గజపతుల కొంపకు ఈ కుమ్ము పెట్టిన కూళయు పడు పాటు చూడమా. అమాత్యులవారును నాతో ఈ విషయ మిప్పుడే మాటాడి వెళ్ళినారు—మీ కెందుకు, మే మున్నాము లెండు.

భానుమతి:

పెండ్లిపాటికి పెండ్లిజరుగ పిదపటిదేమిటి?

కళావతి:

పెండ్లితోడిదే పెద్దపెండ్లి. దానికేమిగాని రుచీకన్యదే నాకగు విచారము.

భానుమతి:

(నిట్టూర్చి) ఈమె సరియైనదగుచో ఈ నెపముననే ఎంతపని చేయగూడదు. "మా యిష్టప్రకారము కాకున్నమానె. మఱెవ్వరిని కట్టుకొన్నను అది నీ ఇష్టము. ఇపుడీ యవమానమునకు ముందు చచ్చుచున్నాము. పరిస్థితులకును ప్రాధాన్య మీయ బనిలేదు. నెప మిదిగానే అతనిని హతమార్చెదము" అని యిట్లొకసారి నీవు చెప్పిచూడ రాదటవే.

కళావతి:

చెప్పెదను, మీమాటగా చెప్ప టొక్కటియే తరువాయి. నాకై నేనింతయు చెప్పకపోయినదిలేదు, అసంభవము తల్లీ. పెండ్లి జరుగకున్నను ఆమె యాతని పత్నియే అనుకొనుడు.

భానుమతి:

నాకు కూతురు కాదది. కానపుడు ఏ చావు చచ్చిన నే మికను. (కన్నీళ్లు నూలుచు నిష్క్రమించును)

(తెర వ్రాలును.)

# రాయలు

## విష్కంభము,

స్థలము—విజయనగరము.

ప్రవేశము: సౌధోపరితలమున నిలుచుండి న్యూనిజు.

మెఱవణియు వచ్చుచున్నట్లున్నది. అయినను ఆశ్చర్యము! ఒకేయొక దినమున—ఇర్వదినాలుగు గంటలలో నగరమెంత అలంకరింప బడినది. నిన్న ఈపాటికి అనుకొన్నదే లేదు. తెల్లవాఱు లోపల ఎచ్చట చూచినను పచ్చతోరణములే. ఏ ముంగిటను రంగవల్లులే. ఏ వీథిని - ఏ మూల చూచినను పరిశుభ్రతకు పెట్టినది పేరు! మురికి కాల్వలు కూడ ముద్దులొలుకు నట్లున్నవి. పురమంతయు నిట్లు పెండ్లిల్లుగా కన్పట్టుటే పెండ్లికొడుకై ప్రభువు వచ్చుచున్నా డనుటకు నిదర్శనము కాదా.

విజయనగరము, విద్యానగరము — రెండు రెండు నామధేయములు ఈ నగరికెంత సార్థకములైనవి. ఒక్కటి చాలదుకూడ. ప్రపంచమున ఇట్టి పట్టణ మింకొక్కటి ఉండబోవునా అని సందేహము. మా లిస్బనుగాదు — పారిసుగాదు — లండనుగాదు — ఏది దీనితో పోటికి రాగలది. ఈ నాగరికత, ఈ వైభవము, ప్రజలకు రాజునకు మధ్య ఇట్టి ప్రగాఢాభిమానము నెందుగలదు. ఎంత పట్టణము — ఏమి శిల్పసంపద — ఎన్నిలక్షల జనము!

అందును ఆహ్వానింప పురివెలుపలి కెదురుపోవు గోవిందరాజాది రాజకీయోద్యోగులతును ముందు మిగిలి ఉవ్విళ్లూరుచు వెల్లివిరి సెడు జనసమూహముల వలన నగరము మఱికొన్ని మైళ్ళకు ఎగ బ్రాకినదో అన్నట్లుండదే.

సామాన్య ప్రజయందును తుది దగిలిన ఈరాజకీయచైతన్య మేమందుము.

"కొండవీడు మందేరా—
కొండపల్లి మందేరా,
కాదని యెవ్వడు వాదుకు వచ్చిన,
కటకంబాకా మందేరా"

అని పనిపాటులవారును కిలారించుచున్నారు. ఆరరే! ఈ యూరేగింపు—బాంధవులు, కవులు, పండితులు, పౌర జానపద ప్రముఖు లొకవంకను సైనిక విన్యాస మొకవంకను బారులుదీరి ముందు నడచుచుండ దిగ్విజయ లక్ష్మింబోని అర్ధాంగితో భద్రగజం బధిరోహించిన ఈ రాయలు త్రిభువన విభవము జుట్టివైవ జన్మిం చిన దేవాంశ అనిపింపడే! ఆహా! కురిసిపోవు ఈ పూలవానలు, మెఱసిపోవు ఈ కర్పూర హారతులు, మురిసి పోవుచున్న ఈ పుర లక్ష్మిని ఎంతని యభినందింపను!!

(తెర వ్రాలును)

# చతుర్థాంకము

---

స్థలము—విజయనగరాంతఃపురము

ప్రవేశము: పాన్పుపై బాలీసున కనుకొని రాయలును,
ప్రక్కన తలవంచుకొని కూర్చుండి రుచీదేవి.

రాయలు:

తగిన సంస్కారవతియు సౌందర్యవతియు
ప్రణయవతియైన యర్ధాంగి బడయడేని
వాని సంపన్నతలకంటె వానికింక
లోకమందును గలదె బాధాకరంబు.

(నగుమోముతో ప్రక్కనున్న కనకపీఠికాకరండమును అలవోకగా తీయుచు మూయుచు నున్న రుచీరమణి దెస జూచి) ప్రేయసీ, చిత్ర రచనలో లేదుగా అభిరుచి? లేకున్న నేమాయె లెమ్ము. అపరిచితులను సైతము తటస్థపడులే తడవుగా నాకర్షించి అభిరుచి కొలిపించుకొనునవిగదా నిజమునకు కళలు!

ఆ రాధామురళీధర ప్రణయబాహాబాహి వీక్షించినన్
గౌరీశంకర హావభావమయ రంగన్మంగళాపాంగ పా
శీరాసిక్యము చూచినన్ మఱల నోలిన్ చిత్తరుంబొమ్మలే
కారే తా రెటువంటివారు నతివా కాబట్టి మోమెత్తవా.

రుచీదేవి:

(కలకంచియే) చిత్రములు తలవాల్పవా అవి స్త్రీలవేయైన ఈ వర్ణనలకు!

రాయలు:

(హర్షపులకితుడై నవ్వుచు) అంతఃపురమును సైతము రసమయముగా పడసిన ఇప్పుడుగదా నేను ధన్యుడను. ( చేరదీసికొని చిబుకము స్పృశించుచు ) విదుషీమణీ, ఇది నీ వెఱుగుదువో లేదో గాని నిన్ను నేను ప్రేమింప గారణము, దోహదము — సర్వము తానెయై మన వివాహ ప్రాప్తికి హేతువనదగు దూతిక యొకర్తు గలదు. తచ్చిత్రము నీకిప్పుడు ఎట్టెదుట నున్నను చూడకున్నావు— ఏతచ్చిత్రము నేమనవలెను.

రుచీదేవి:

(తలయెత్తి చూచి ఆశ్చర్యముతో) రచనయు నాదే!— ఇది ఇచట కెట్లు వచ్చినది! (ముఖము తలవంచుచు నగుమోముతో) కొల్లలు కొట్టువారికి ఏవి చేజిక్కవు.

రాయలు:

చేకొన్నవారి హృదయవీథులనెల్ల నమాంతముగా అవి కొల్లగొట్టకున్న చాలుగాని అకృతి యటుంచి అద్దాని రచనయు నీదేనా? జగతినే గాక చిత్రకళా జగత్తును సైతమిటు వెలుంగజేసినది నీవే? నీవు! నీకా యిక మా చిత్తరువులు రుచించునది. కాకున్నను రుచికి రుచింపవలెనన్న సామాన్యమా!

రుచీదేవి:

కాబట్టియు సామాన్యులు కాని దెవరైనది స్పష్టపడియే పోయినది.

(తటుక్కున నవ్వన రాయలు ఆమె చెక్కిలి లాగి విడుచును. పీఠము మీదు రుచీదేవియు 'పేటిక' 'ని తమలపు మడుపులనుండి ఏర్పతించి ఒక్కటి వెలికి తీయును.)

రాయలు:

కాన్కయో? తమలపు మడుపా లేక నిక్కపు శుకశాబక మేనా? (చిలుకతో బాటు ఆమె చేతులందుకొని నిమురుచు) మణికంకణ న్యాయమున నుండదే ఈ చేతికి ఈ చిలుక. వహ్వా! కళింగశిల్పము. అతుకుతోపని ఈ యబ్బుర మేమందుము. ఎంతటి శ్రద్ధ గొంటివి చెలీ. ప్రేమపూర్ణత కిదిగదా తార్కాణ!

రుచీదేవి:

(అటు చూచుచు) గుర్తించి ఆదరించు పతి యున్నపుడు కౌశలము చూపని కళ యుండదు గదా.

రాయలు:

గ్రహింపగల మేరకు ఆనందించువలకేగాని రసజ్ఞు లనబడు వారైన కళలమర్మము సమగ్రముగ గుర్తించియా? గుర్తింపనే గుర్తించిన కృతహస్తులగు తత్ప్రచయితలకు వారెల్ల నువ్వెత్తుగా అమ్ముడు పోయినదే గుర్తుగదా. కావున విప్పి, మఱల చుట్టి చూపుదువు. (చేయి చాపును. రుచీదేవియు చిలుకవ్వాలో నైగాని శేర్వేలు భాగములుగా విడదీసి అందిచ్చును)

రాయలు:

(గైగాని) అహో! తల ఇటు తోక అటు, పైన ఱెక్కలు — క్రింద కాళ్లు నలువైపుల నాలుగతుకులు ఎంత చక్కగా నమరి నవి! నడుమ ప్రధానపుదైన ఈపాట్ల మికనెట్లును శుక గర్భము స్ఫురణకు తెచ్చుగదా. (మఱల ఒండొంటితో అతికించుచు మానిమానినగవులతో) పై పసయేనా లోనను విశేష ముండునా?

రుచీదేవి:

జిహ్వా కొక రుచి యందురు. అదిగాకయు అనుభవము పురస్కరించుకొని పతు లేమివాకొనినను అదొకతీరు గాని కృతుల గుణములు కర్త లుగ్గడించుకొన్న నేమి గలదు.

రాయలు:

(చత్కరించుచు) రుచి చూడని పాకము ఒకరుచూచు పని యుండదు.

రుచీదేవి:

జిహ్వాది రుచిగాని రుచి కసలు రుచి యెక్కడిది. ఏమైనను అంత వ్యర్థముగా నుండదని మాత్రము ఉద్ఘాటింపగలను.

రాయలు:

అది నిజము. (చిఱుక నగుచు చిత్తుక్కన లేచిపోవును.)

రుచీదేవి:

(ఆయన పోవుపై కట్టెమూచుచు) ఏమిది! హద్దుమీరి యాడితినా- ఏమి యీ వైపరీత్యము. కాదా ఇది వైపరీత్యము? కాకున్న ఉన్న ట్లుండి ఏల యిట్లు చివాలున లేచి పోవలెను. దైవమా, నా వైభవ మింతకు కన్ను కుట్టదుగా- నాకై చివరకు దైన్యము మిగుల్పవు గదా! అయ్యో,

శాత్రవరాజపుత్త్రినను శంకకు దోడుగ మత్త్రసంగమం
దే త్రుటిదోష మేర్పడెనొ ఎంతటి తూకము దాని కిచ్చునో
కృత్రిమవార్త లెట్టివియొ కేవల మాయన సాహచర్యపుం
బాత్రతకుం దొలంగనిడు మా దురదృష్టవిధం బదెట్టిదో!

అయినను బెదురుతోనే వెళ్లినట్టా? ఏ రాజకార్యావసరమైన అప్పటి కప్పుడు జ్ఞప్తికి వచ్చియుండరాదా. వెళ్లినట్లే సరాసరి తిరిగి రాను కూడదా. ఎంత నిజము! అంతటి వాలాయములైన రాజకీ యావశ్యకతలు ఇంతలో నేమి ముంచుకొని వచ్చినట్లు. లేకున్న తాంబూలములో తన కనుమాన మేమైన ... ఏమిమాట-అట్లుం డునా. మొత్తముమీద ఏ మహాసముద్రమో ఉప్పెనపెట్టుగా పొడ కట్టి పోవుచున్నది. ఏ కరాళరాక్షసియో నను మ్రింగుటకు చేయు వికటాట్టహాసమే సుమీ యిది! (ఉలిక్కిపడి) ఎవ్వరిదో వచ్చు సవ్వ డిగా నున్నది. దైవమునకైన అంత దయలే కెట్లుపోవును లే.

(దిగ్గన లేచి తలవంచుకొని యుండును. ద్వారపాలకుడు ప్రవేశించును)

ద్వారపాలకుడు:

(దూరమున నాగి) తల్లీ, నా రాకకు క్షమింపవలెను.

రుచీదేవి:

(గద్గద ధ్వనితో స్వగతము) దైవము!—దయ!!

ద్వారపాలకుడు:

ద్వారపాలకుడను. తల్లీ. దేవరవారు మఱికొన్ని విడెపు మడుపులు తెమ్మనుచున్నారు.

రుచీదేవి:

(తేఱిచూచి) ఏమది? ఏమైయున్నను అట లేరైరే చెలికత్తెలు? వెంటగొని కదా నీవైన రావలసినది.

ద్వారపాలకుడు:

తరములుగా నంతిపురి కొల్చువారమే తల్లీ. పనుప దగని

వాడ నగుచో నన్నేల పంపుదురు: పంచిన పిదప ... జాగుచేయక ఇచ్చిననే మేలు మాతా.

రుచీదేవి:

పట్టు మఱి— (పేటిక నహాంతముగా విసరివేయును.)

ద్వారపాలకుడు:

(ఒల్లెచెరగున కట్టుకొని) మహారాణుల సెలవు. (నిష్క్రమించును)

రుచీదేవి:

దీని నేమనుకొనను? మఱేమియు నట్టివి లేవులె మ్మనుటే? బెడుపుతో కాదు లెమ్మనియే? ఏమిమాట! అపాటిదే యైన నింకేమి తండ్రీ. ఎంతటి ఘోర కారణమో—ఏది యెట్లుగా పరిణమించి నా గొంతునకు ఉరి యగుచున్నదో! ఎక్కడికో యెందుకు. 'చెలి కత్తెలు వచ్చి కైకొని పోగూడదా' అన్న నా మాటను ఇప్పుడు ముందు ద్వారపాలకు డేమి కటువుగా తీసికొన్నాడో.

కలదమ్మా కలదే యుపద్రవమొ యీ కళ్యాణ గర్భంబునం
గల దేదో అనివార్యపుం బ్రళయమే కాకున్న నిట్లౌటయుం
గలదే మామక మందభాగ్య మెటు నన్ గన్నామెనో దైవమే
కలదింకన్ కలదింత సత్యబలమే కాపాడ నాపాలికిన్.

(రామరాజు ప్రవేశించును)

రామరాజు:

(దూరమున నుండియే) మాతా,

రుచీదేవి

(మొగము త్రిప్పుచు) ఎవరు?

రామరాజు:

దళవాయిని. రాయలవారి పనుపుజేసి రానైతిని. క్షమింపుడు.

రుచీదేవి:

ఏల పంపిరి?

రామరాజు:

దేవిగారిని పుట్టిల్లు చేర్పుమని.

రుచీదేవి:

హా, హతవిధీ. (కూలబడి రెండు చేతులతో తలపట్టికొని గద్గద స్వరముతో) కారణము తండ్రీ?

రామరాజు:

నీకు తెలియ నట్లును నేను చెప్పినట్లునా తల్లీ.

రుచీదేవి:

అయ్యో, ఒకవేళ తెలియుననియు అనెదరుపో, తెలిపిన తప్పులేదు గదా.

రామరాజు:

న్యాయవిజ్ఞప్తికి, న్యాయాన్యాయ విమర్శకు ఇక నాస్కారమే లేనపుడు కారణము తెలిసికొని మాత్రము?

రుచీదేవి:

ఈ నేరమునకు ఈ శిక్ష–అని తెలిసినప్పుడుగదా ప్రజలకది ప్రయోజనకారి.

రామరాజు:

పురాకృతకర్మ ఇదమిత్థమని తోచుబడియే కాదుమణి. భగవంతునిగూడ అడుగవలసినట్లే ఆ ప్రశ్న.

రుచీదేవి:

అయ్యో, నా యెడల మీ కీపాటి కనికరమైన కలుగదేమి?

రామరాజు:

తడవులేదు తల్లీ.

రుచీదేవి:

అంతటి నేరమా తండ్రీ.

రామరాజు:

ఇంకెంతలు చేయనేర్చి యుంటిరి తల్లీ. విడియములో విషముంచి విభున కిడుకంటె— (కహకహ నవ్వును)

రుచీదేవి:

(దిగ్భ్రమతో) అఁ—అఁ—విషమా—విషము? హరహరా!—
(నేలకొరగును)

రామరాజు:

ఈమెను చూచిన అమాయకురాలుగా నున్నది. అటుచూచిన స్త్రీ జాతియో సమయోచిత చాతురికి పేరు పడ్డదేమణి! పల్లకియువచ్చుచున్నది. ఇద్దేవి కదలునట్లు లేదు. దాసీజనము చేతనైన నెత్తింతుగాక. (వడివడిగా నిష్క్రమించును)

రుచీదేవి:

(ఇంచుకించుకగా తెప్పతిల్లి గజగజ లాడుచు) వి – ష – మా—
విషము? దైవమా, ఇదియేమి. నా చేతిమీదుగా విషపు తాంబూ

లమా ఇప్పించితివి. (గుండెలు గుద్దుకొనుచు) అమ్మ. అమ్మ. నా నాథుడు సురక్షితుడేకదా. నా కది చాలును. ఇంతపనికి పాల్పడుగా కళావతి! అదిపనిగా పురమాయించి, గంటలకొలది చిత్రించి చిల్కలుగట్టి తెచ్చిన ఆపెది గాకున్న ఇంకెవరిది ఈ ద్రోహము. ఔరా! నాగరికభంగులని, పతిమెప్పు పడయజేయు నని, ప్రణయ సల్లాపములకు ఉపక్రమణిక యగునని ఏమేమో చెప్పి నమ్మించి కఱుక్కున నా గొంతుగోసెగదే. అయినను ఆమెకేమి పోగాలము? నాపై తనకైన నంత క్రౌర్య మెన్నడు లేదే. ఓహో — ఉండనే యున్నది గదా. ఆ చల్లని తల్లి చలువ గావలయు. జరిగియే యుండును. ( కలయూపుచు ) ఓసి రాక్షసీ. మూర్ఖురాలా. నీ కుల తత్త్వము కూలిపోను. ఇంత వంచకత్వమునకు—ఈఘాతుకత కెట్టు లొడిగట్టితివే. నీ కెంత నచ్చకున్నను కొండంత నా ఆశ గొల్లున దీసితివేమి!

హా, దుర్విధీ. (నెత్తి కొట్టుకొనుచు గద్గదోక్తిగా) విధి యేమి చేసినది. ఈ నరపశువులు చేసిన దాని నింకను ప్రతిహత మొనర్చె గాక అట్టిది గాకున్న ఇప్పటివలె నిహమునకేగాదు — పరమునకును దూరమై యుండనే, ఆపాటి మేలు చాలదా. కాని, కాని, నా పతి ఇదియేమి చేసినాడు. అపరాధినిగానే నమ్మిన తన చేతిమీదుగనే నాకు సద్గతి ప్రసాదింపరాదా. కృతార్థనై యుండును కాదా. నేర మెంతటిదైన విచారణతో నిమిత్తము లేనిదగునా. అంత తొందరపడియా తాను తీర్పు చెప్పవలసినది. అయ్యో, అయ్యో, ఇట్లని ఎవరి నడుగగలను — ఏమి చేయ గలను. ఇంతకు వచ్చినది, ఇంకేటి సిగ్గు —అపరాధము నాది కాదని మొఱపెట్టు కొందునా; ఆలించు వారెవరు? ఋజు వేమి యీగలను. నిష్ప్రయోజనము,

అట్లును నలువురమ్రోల నన్ను మఱల కాన్పించు కోవలెనా. మానాభిమానములు సైతము మంటగల్పు కొననా. ఏమని ఇంకి చట నిల్తును—అట్లని పుట్టింటి పెంగ మెట్టుచూతును. ( [illegible] ) ఏది నిలువ నీడ — ఎంత మొండిబ్రతుకు! హా ప్రాణమా, హా హృదయమా, ఆగిపోరాదా—చిటుక్కున ప్రేలి పోరాదా—సుఖపడి పోదుగదా. అహా, అదేమాయె. అటులైన నేను పోదుగాక- అపకీర్తి అది పోదుగా. కలకాలము ఆబాలగోపాలము నలుగుర నోళ్లనాన కెట్లుతప్పును. చావుతో దప్పునొకో ఈ యూఱు?— తప్పించు కొనుట అటుంచి చచ్చిననే సుమా మఱంత దృఢపడునదియును. హా, ఈ యభాగ్య జీవికి బ్రదుకు లేకున్న చావును లేదా. హా, దైవమా -- హా, కాలమా— హా, రుచీ— హా— హా—

(మూర్ఛిల్లును.)

(తెర వ్రాలును)

# పంచమాంకము.

---

స్థలము—రాజభవనాంతరము.

(కూర్చుండి కను లెఱ్ఱవడి యుండ రాయలు.
ప్రక్కగా నిలుచుండి తలవంచుకొని తిమ్మరుసు)

**తిమ్మరుసు:**

చూడలే దాయెగా దైవము!

**రాయలు:**

అదెంత చూడలే కున్నను పౌరుషము పరాకాష్ఠజూచినది. చూడబట్టి పరువైన దక్కినది.

**తిమ్మరుసు:**

కట్టుకొని—కట్టుకొనక రెండును ఒక్క టేయగు టదియొక పౌరుష మనవలెనా. మన శక్తి యుక్తులు ఆ దైవము ముం దెంత పఱకు. తుది విజయ మెటుదిరిగి దానిదే యైనది.

**రాయలు:**

కటకమున నైన నేమో అన్నట్లు నిషేకమున కిచ్చుటకి గొని వచ్చు టేమి! అటనుండియు సాగివచ్చు కుట్ర నొకకంట గన్పెట్టియే హెచ్చరించుచు వచ్చు టేమి — మీవంటి ప్రతిభావంతుల మేధస్సుముందు ఆ దైవము సైతము జోహారు లర్పింపదా.

తిమ్మరుసు:

మఱల వచ్చి మాటాడుటకును నా కింతవఱకు తీఱ దాయె ను. అప్పుడు నేను చెప్పుచుండ దూర దాయెను. త్వరపడ వలసి నది కాదనియే ఇప్పటికైన నా యభిప్రాయము. సంధియు ఈమె మూలముననే జరిగినదని వినుచుంటిమి. రామలింగకవి ఒకవంక నేమో చెప్పుచుండెను. చూచుట కనురాగవతిగానే తోచెను.

రాయలు:

అనురాగవతి! ఆ బాహ్య సౌందర్యమునకు దగిన అంతఃసౌం దర్యముండి...... (గద్గదధ్వనితో) అయ్యో. ప్రపంచము తానెంత బూటకపు దైనది మేడిపండు రూపమున చూపి చెప్పుచునే యున్నది.

తిమ్మరుసు:

తెస్సగా పాకమున్ననేకాని రంగుకూడ రహిదేలి రాదు. దీని కేమందువు? లోక మెట్టిటో యున్నది. ఒకేయొక సూత్రమా? అందునను ఒక విశేషము.

> నీట నొకకొంత మునిగిన నిలువుగఱ్ఱ
> చక్కటిది కుంటుగా దోచు షక్కగసమె
> పూర్తిగ మునింగినను లేక పూర్తి వెలుప
> డిన నవక్రమె మఱల; నిట్టిదియు జగతి.

రాయలు:

చమత్కరింప గల కొలదిని వాక్ప్రపంచ మెట్టిదయిన నైనదే గాని వాస్తవ ప్రపంచ మికెట్టిదియు గాదు. ఏది యెట్లున్నను,

మానవు డెంతవాని కొకమాదిరి దుఃఖపు గూడెలెండు సౌ
ఖ్యానుభవంబు పేర జగమంతయు వంచిత; మట్లు గానిచో
కావనిదౌ నొకానొక సుఖంబని వెంపరలాడిరే ఋషుల్
మౌనులు; స్వార్థ మేది పదిమందికినై శ్రమగొందురే ఘనుల్.

తిమ్మరుసు:

ఐనదైనదిగాని మెడలో ఆపాటి యానవా లుండనిమ్ము.

రాయలు:

(ఉలిక్కిపడి కడవి చూచుకొని) పుట్టింటి పూసతోగూడ సాగింపు
మని శాసించుచు మఱల నొకవంక సమస్తము ననదగిన ఈ సర
ముంచుకొను చుంటిగా! (తెంపి అవతల వైచును)

తిమ్మరుసు:

మెడనుండి కాదు తీసి త్రెంచుటకు.

రాయలు:

మదినుండి తెగత్రెంపు లీపాటి దనుకనా? వంచక ప్రపంచ
మును గుఱించిన అనుక్షణస్మరణ కగుచో ధరించిననే మఱల
మంచిది. (దౌవారికుడు ప్రవేశించును)

దౌవారికుడు:

(ద్వారమునకే ప్రణమిల్లి లేచి) పెద్దన్నగారు, వచ్చియున్నారు.

(తిమ్మరుసు రాయలదెస చూచును.
రాయలు ఉపేక్షగా తలవంచును)

తిమ్మరుసు:

(దౌవారికునితో) నాకై కాబోలు— ఇదే వచ్చితి నసుము.

దౌవారికుడు:

ఆజ్ఞ. (నిష్క్రమించుచు)

తిమ్మరుసు;

ఆనందకందముగా నుండగలదని ఆర్భాటముగా జరుపదల చిన మనుసంభవ కృతి సమర్పణ మహోత్సవ దినమో యిది! భగవానుడ, రాత్రి జరిగిన ఉత్పాతమునకు ఎందఱెన్ని విధాల హతాశులు.

రాయలు:

కా బనిలేదు. నా నిజమైన యిల్లాండ్రు ఏనాటికైన ఆ కృతి కన్యకలే ఔదురు పోదురు. అవుగాని అప్పాజీ. లేనిశాంతి లేకనే పోయినది. రాచూరు వశపఱచుకొను రాయడే రాయ డనిగదా సాళువనృసింహుని తుదిపలుకుగా చెప్పుదురు. ఆయన ఆత్మ శాంతికైన నిక పాటు పడుదుమా?

తిమ్మరుసు:

అదియే నాకును మిగిలియున్న ఏకైక వాంఛ. నా జనన మప్పుడు గాని సఫల మైనట్టు తలపను. కాని అదియేమి సామా న్యమైన దనుకొంటివా.

అరి భూవల్లభ దుర్లభంబయి తురుష్కాధీశ్వ రాధీనమై
ఒరు లెవ్వారికి లేని నిర్భయ హయవ్యూహంబు లా తోనివై
దర బెరొంపిగదా తదాక్రమణ చింతాశల్యులై రాలిపో
యిరి పై మూడు తరాలవారు; మనదయ్యోగా వంతు నేడింతకుఁగా.

ఎట్టు సాధింతమో మఱి.

రాయలు:

సాధ్యము కానినాడు ఆ పవిత్ర సాధనలో సమసినను మేలే గదా. కాల మిక గడవ నీయకుడు.

విదిత విద్యారణ్య బిరుదాంకిత మనీషి
మాధవాచార్యుండు మంత్రి గాగ
ఉక్కుతునక్కను బోని బుక్కరాయుడు ముందు
నడచు నుద్దండ సేనాని గాగ
ఆవేశవంతమౌ నాంధ్రకన్నడ వీర
లోకంబు పనుపడ్డ మూక గాగ
స్వాతంత్ర్య బలివేదిపై సమస్తము నిడ్డ
హరిహరరాయలు దొరయు గాగ

నాటి కేనాడొ వంస్థాపనంబు వడసి
సాగివచ్చెడి యీ సువిశాల విజయ
నగర సామ్రాజ్య లనదనూన ప్రతిష్ఠ
కృష్ణరాయలతో నటో యిటో యనుండు.

తిమ్మరుసు:

ముందు నీ పలుకులు నీ భగ్నహృదయము దెలుపుచున్నా వనుము. నీవెంత త్యాగివైనను నీపై నాధారపడియున్న నిఖిలాంధ్ర కన్నడ ప్రజా ప్రాభవము నిట్లు జూదమునబోలె నొడ్డుటకు నీ కేమి యధికారము? రాజకీయము లెప్పుడును వ్యక్తిగత మనోవికార ములకు లోను గారాదు. అట్లగుటచే ఘటిల్లిన ముప్పునుండి మును పెంత కష్టముమీద బయుట బడ గలిగినది మన మెఱుగు దుము. ఏండ్ల కొలదిగ సన్నాహము లొనర్పుకున్న సమయమున కేకమగు స్వభావముగల నలుగురు నవాబుల నెదుర్కొన లేము.

తగినంత తురంగబల మది లేనందుననే అయ్యశ్వపతుల యెదుర హైందవరాజులు నిలువలేకుండు టెఱుగుదుము.

రాయలు:

అట్లే కానిండు. ఆ మహాకార్యము సాధించుటకే తద్విజయ లక్ష్మీ సమాశ్లేష సుఖ ముద్దేశించియే జీవించెదను. మీ యిష్టము వచ్చినంత సన్నాహమున కెట్టును మీరే యున్నారు. దినములు నిమిషములుగా గడప నాకును కావలసినంత కావ్యగోష్ఠితో గూడిన ఆనందలోక మున్నది. అనుదిన స్మరణీయులగు అమ్మహామహు లచే నట్లు ప్రతిష్ఠితమై, సాళ్వ నృసింహాది వీర రాట్సింహముల ఉత్తేజక తేజోగ్నులవలనం బ్రవర్ధితమై తరతరంబులుగా నవిచ్ఛిన్నమై వెలయు ఈ సామ్రాజ్యజ్యోతి నొక్కట ధగధగద్ధగలతో వెలుగొంద జూచి ఆనందించెదము.

(రామరాజు ప్రవేశించి ప్రణామ సూచకముగా తలవాల్చును)

తిమ్మరుసు:

(ఆశ్చర్యముతో) ఏమది! ఇంతటిలోనే......

రామరాజు:

నడుమనే వదలి రావలసి వచ్చినది. మధ్యాహ్న భోజనాదులకై నీటిపట్టు చూచుకొని ఒక యరణ్యమున పటకుటీరము లెత్తించు చుంటిమి. తనంతనె పల్లకి దిగిన అద్దేవియు నన్ను పిలువనంపి "పుట్టిన యింటికో మెట్టి నింటికో నేను పోగలను. మీ రందఱు అవశ్య మింతట వెనుకకు మఱలవలెను" అని పలికెను. చెక్కి చేసిన శిలావిగ్రహమువలె ఆమె నిలబడ్డ తీరు, స్థిర సంకల్ప ద్యోతకములై మెఱసిన ఆమె నేత్రములు చూచిన ఇక

మాటాడి లాభములేదనిపించెను. పైపెచ్చు మేము బయలుదేరు వఱకు తా నట్లు నిలబడియే యుండెను. నా వఱకును ఇట్లనుట సాహసమే యైనను ఆమె నిర్దోషగా నున్నదని విన్నవింపక తప్పదు.

రాయలు:

ఏమైనను ఆ యధ్యాయ మంతటితో ముగిసెను. (లేచును)

( తెర వ్రాలును )

# షష్ఠాంకము.

## ప్రథమరంగము

స్థలము—అరణ్యమున సత్రశాల.

(అన్నము తిని త్రేపు బాటసారులు తమకు నీళ్ళందిచ్చు పనికత్తెతో)

1-వ బాటసారి:

యెళ్ళొయ్యొత్తామండి.

2-వ బాటసారి:

పోయి వస్తాము. అన్నంపెట్టిన......

పనికత్తె:

**మీ** మాట కష్టము వచ్చెదను. ఈ వ్యావహారిక భాష కొక దారి తెన్ను లేకున్నది. ఒక్కొక్క ప్రాంతమువారి తెలుగు వే ఱొక్క ప్రాంతమువారికి అర్థమేకాదు. వారి కర్థమైన వఱకు అది చక్కగా అక్కఱకు వచ్చునది ఒక్క వేళాకోళానకే. ఐక్యత తే వలసిన భాషాసూత్రము ఆ విధముగా అనైక్యతకు కారణ మగు చున్నదనిన అది యెంత శోచనీయము! ఉదాహరణకు మొన్నటి సంగతియొకటి — దక్షిణాంధ్ర యాత్రికుడు "పూడిశినాడు" అన్నమాటకు పూర్వాంధ్రు డక్కడనుండి పక్కున నవ్వినాడు. కాని దెబ్బకు దెబ్బగా "పోతామంటే చచ్చినంత పనైనపుడు పూడి స్తేనే పీడ వొదిలినట్టు కాదా" అని అత డన్నాడు లెండు.

వచ్చేము, వత్తాము, వొస్తం, వొచ్చేం — ఇత్యాదులకంటె మీ రన్నట్లు 'వస్తాము' అను రక మొకింత మెఱుగేమో! ప్రయత్నిం చిన సంప్రదాయ సిద్ధమైన, సౌలభ్య సహితమైన ఒక సమన్వయ మార్గము దొరకదా— అట్టి ప్రక్రియలకెల్ల లాక్షణికముగాను ఒక గతి గల్పించి అందఱకు అవి యందుబాటగునట్లు చూడను గూడదా. అట్టి సంస్కారమే అపుడపుడు నున్నచో ఈ వ్యావహారిక భాషకును గ్రంథస్థభాషకును మధ్య నింత వ్యత్యాస మేల యుం డెడిది, ఉదాహరణకు "అన్నంపెట్టిన" అనిగదా మీ రిప్పు డన్నారు. ముపర్ణకమునకు బదులు నిండుసున్న వాడితిరి — ఇంతేగదా. అట్లు వాడవచ్చు నను ఇత్యాది లక్షణాలతో ఆ యఖాతమున కొక వంతెనయు కట్టవచ్చుగదా. గ్రామ్యమును అస్పృశ్యజాతిని వలెనే దాని కర్మకు దానిని వదలివేయుట చాలక 'దూరము దూరము' అనవలసినదేనా? పోనిండు. మీరు ఏదో అన బోయితిరి.

2-వ బాటసారి:

మఱేమీ లేదు. అన్నంపెట్టిన తల్లిని మఱచిపోలేము గదా. అందునూ నట్టడివిలో.

పనికత్తె

మీకేకాదు. మా వంటి ఎందఱో పనికత్తెలకు నిత్యము ఇక్కడ అన్నము పెట్టు తల్లి వేఱే యున్నది లోపల. వారు మీకు కన్పించరు లెండు.

2-వ బాటసారి:

(అంతటను కలయ జూచుచు ఆశ్చర్యపాటుతో) ఎంతగొప్పసత్రము! విశాలమైన ప్రహరి, ముంగిళ్లు, లోగిళ్లు, వసారాలు, తోటలు, దొడ్లు–

అన్ని హంగులూ వున్నట్టే. అంతఃపుర మెందుకు దీని ముందఱ. అందుకు దగ్గట్టే వున్న యన్ని పద్ధతులూనూ. నిరాడంబరమైన రాజరీవికి ఈ సత్రమే నిదర్శనమేమో. మొత్తంమీద రాణివాస స్త్రీలు కాదుగా?

1-వ బాటసారి

ఆరి పేరేవిటో?

పనికత్తె:

అన్నపూర్ణాదేవి. ఎవరో, ఎక్కడివారో గాని దిక్కుమాలిన వారికెల్ల దిక్కైయున్న ఈమెను దివినుండి దిగిన దేవతగానే ఇక్కడివా రెంచెదరు.

1-వ బాటసారి:

యా మయినా యీరి కీ యెచ్చమంతా యెక్కణ్నించో వొత్త? అదీ తెల్దేటి?

పనికత్తె:

ఆమె పట్టినదెల్ల బంగారమగున ట్లున్నది. అయినను మీ యిద్దఱి మాటలలో, ఇద్దఱును పూర్వాంధ్రులుగానే యున్నది మఱల, ఎంత తారతమ్య మున్నదో చూడు.

1-వ బాటసారి:

మఱేనండి. లేకేం? ఆరి దేమో వొంగోలుట. మా దొచ్చి గోదా రొడ్డూనూ—

2-వ బాటసారి:

(లోగిలి తొంగిచూచుచు) రాయలవారివే చిత్తరువులు! సరిసరి.

ఇటీవల పెళ్లాడి వొదిలారన్నది ఈమెనేనా యేమి!

("మురళీ, మురళీ" అని పిల్చుచు సంభ్రమముతో లోనికి పనికత్తె ప్రవేశించును.)

పనికత్తె:

(వచ్చి రాకముందే) మురళీ, ఉద్యోగులుగా ఉన్నది — ఎవరో వచ్చియున్నారు రావే.

మురళి:

వచ్చిన రానీ గాని సమయమునకే నీవును వచ్చితివి. వీ రేమో అనుచున్నారు—ముందిది వినవే. రాయలవారు ఒకామెను పెండ్లాడి ......

పనికత్తె:

(చకితయై బాటసారులతో) అవునా?

2-వ బాటసారి:

(తల పంకించుచు) అడివిలోనే వున్నారు మీరు. అవుగాని అయ నగారి చిత్తరువులు అట్లా వ్రాయించడానికి కారణమంటూ ఈమె యేమిగా చెబుతుందో?

మురళి:

ప్రభుభక్తి.

2-వ బాటసారి:

పతిభక్తిగా ప్రశ్నించి చూళ్లేదూ?

మురళి:

మనకు మించిన చాకచక్య మామెకున్నది. బుస బయట

రానిచ్చు ఘట మనుకొన్నారా?

1.వ బాటసారి:

పోనిత్తురు. తేల్చుకొని మనం చేసే దేమిటో! తాను కానిపక్షం లో తిన్నింటి వాసాలు లెక్కెట్టి నట్టేగా.

2.వ బాటసారి:

అదీ నిజమే. శెలవు తల్లీ మా కికను— ( **తక్కినవానితో** ) మన మెళ్తాముర్రా. (**ఇరువురు నిష్క్రమింతురు**)

మురళి:

తేల్చుకొన్న లేదా ప్రయోజనము? నిజమేయైన పరిస్థితులు పాటుకు దేలేమా. తెచ్చి మన ఋణము మనము తీర్చుకోవచ్చు గదవే.

పనికత్తె:

మొదటికి తేల్చుకోలేక చచ్చుచున్నాము గాని నీవేమో అప్పుడే అయనతో చేర్చి వచ్చుచున్నావు.

మురళి:

అదెట్టు తేల్చుకో లేమో చూతమురా.

(**ఇరువురు నిష్క్రమింతురు**)

(తెర వ్రాలును.)

# ద్వితీయరంగము.

సలము—సత్రశాలాంతరము.

(అన్నపూర్ణాదేవి రాయలు చిత్తరువు లిఖించుచుండును.
మురళి ప్రవేశించును)

మురళి:

(ఆగి మాట్లాడక (తెలిసి) పూజామందిరమేమి వారి చిత్తరువేమి! ఎంతొకవేళ రాజైన నిదేమి చోద్యము.

అన్నపూర్ణ:

మురళియో మోగ సాగినది? (తిరిగిచూచి)

కేవలుడే ప్రభుండన సఖీ, పరమప్రభు జెప్ప పిమ్మటన్
దేవునియంతవాడు పతిదేవత యింత వసుంధరామహా
దేవి కదెట్టులున్న జగతీప్రజ పెంపునకెప్డు బాధ్యులై
పావనశీలురైన జనపాలురు పూజ్యులనంగ జెల్లదే.

పతులకు దూరస్థలగు నావంటి అనాథలకెల్ల భూనాథులుగాకున్న రక్షకు లెవరు? ఈ కొండక్రింద ఇంత నిర్భయముగా వసింప నేర్చితిమా: అందును రాజమాత్రుడటవే! మీరు మీమీ భర్తలను దండునకంపి యథాశక్తి రాజసేవ చేయుచుండ నే నీమాత్రమైన రాజభక్తి ప్రకటింపవలదా?

మురళి:

తెలిసినవారు వద్దనరు.

అన్నపూర్ణ:

తెలియనివారు తెలిసికొన్నైన తెలిసికోరు. (కలము లిఖింపసాగును)

మురళి:

ఇంతవఱకు వచ్చినది— ఇకెందుకు గాని తల్లీ. ఎన్నాళ్లు గనో అడుగ వెఱతుము. ఈ రాయలవారును...... (ఆగును.)

అన్నపూర్ణ:

(లిఖించుచునే) ఈభ్రమింగుడు మాటలే ఏమో యనిపించునది.

మురళి:

ఆలి విడిచిన అనఘులే యని విన్నపుడు నాకుగూడ నిజము నకు 'ఏమో' యనిపించినది తల్లీ.

అన్నపూర్ణ:

(అశ్రులాపరాని నవ్వుతో వెనుదిరిగి చూచి) ఎంత నిర్భాగ్యురాలు! అయినను అర్హత లుండవద్దటవే. దీనినిబట్టి ఇటువంటి వైపరీత్య ముల కన్నిటికి దైవము కారణముగాని వ్యక్తుల లోపము కాదేమో.

మురళి:

అంతదూరము మఱల మాకెందుకు. తల్లీ, ఆ రాణిగారిని గుఱించిన మా సందేహము మాదిగాని.

అన్నపూర్ణ:

చాలికను, నన్నేమిగా నెంచి ఎటు వల్కినను తత్పత్నిత్వ

మింత చౌకగా తోచినందుకు మెచ్చవలెగదమ్మ ముందు తమరిని.

(మురళీ, మురళీ యని పిల్చుచు సంభ్రమముతో ఒక పరిచారిక ప్రవేశించును)

పరిచారిక:

ఎవరి యిండ్లకు వారు రాను వత్తురట.

మురళి:

నీ కెగతాళిగా నున్నది.

పరిచారిక:

లేదులేదు. సాయంత్రము లోపల ఇల్లు చేరుదు రని ఈ దారిన గుఱ్ఱపు రౌతొకడు తటస్థపడి మనవారికి చెప్పినాడు

వచ్చెదరు చెలీ, కౌగి లిచ్చెదరు చెలీ
వచ్చెదరట తమతమ యిలు
సొచ్చెదరట బహుమతులుగ
తెచ్చెదరట చెచ్చెర నిట
వచ్చెదరు చెలీ,
కౌగి, లిచ్చెదరు చెలీ.

అన్నపూర్ణ:

(వికసితాస్యముతో) నీ కియ్యవచ్చు బోవే ముందీ శుభవార్త కేమైన బహుమానము.

మురళి:

తెచ్చియేమి తల్లీ. మగవారిని కలిసికొందుము గదా అని యువ్విళ్లూరెదము గాని మిమ్ము విడనాడి పో గలిగిన గదా.

అన్నపూర్ణః

అనురాగము మేరకు అట్లంటివి గాని మీకు నేను చెప్పవలసిన దాననా? అటుచూచిన నాడు మీ భర్తల నెట్లు విడనాడి రానైతిరో అట్లె నేడు నన్నును. పోయి సిద్ధపడుడు. ఇక చెప్పించుకొనకుడు. (ఒక రొకరుగా పరిచారికలు వెడలి పోవుదురు) నిర్భరము గదా వీరి హర్షము. చిర వియోగ దుఃఖితులై చివికిపోవు దంపతులచేరిక జీవాత్మ, పరమాత్మల కలయికంబోని బ్రహ్మానందము గాకేమి. దైవమా, నేనును ఈ జన్మకు...... (అటు ఇటు చూచి చిత్రరువందలి రాయల పాదములపై తలవాల్చి) నాథా, దయ రాదుగదా (తలయెత్తి) ఎట్లు రా గలదు.

తొలిజన్మంబున నే నతీపతుల గొంతుల్ గోయఁలే కెట్టి తంటలు కల్పించితినో మంటెట్టి మగనాండ్రన్ నిందపాల్సేసి భర్తలకుం బాపితినో ఇకెంత ప్రణయార్థ్రంబైన ఏ సాధ్వి యాసలు నే దీసితినో సమస్తము సవశ్యం భోగ్యమై యుండవే.

భూనాథ కులమౌళి నానాథు డొకనాడు
జరిగిన వాస్తవం బరయునొక్కొ
నా నోములఫలంబు నా భర్త నను నంత
నిర్దోషగాను గణించునొక్కొ
మేదినీమఘవుండు నాదేవు డెపుడైన
నాపై గనికరంబు చూపునొక్కొ
నానా కళారాశి నా మనోహరు డట్లు
నా వియోగార్తికి నవయునొక్కొ
ఎపుడయిన దప్పిదారి యేదేని పనిగ
పయన మొనరించు చిచటికి వచ్చునొక్కొ
వచ్చి యీ దీనురాలికి పరమభాగ్య
హీనురాలికి దరిసెన మిచ్చునొక్కొ!

అహా ! ఆశాలత యల్లికమునకు అవలంబముతో నటుంచి, ఆధారముతో సైతము అక్కఱయుండదుపో-సుఖస్వప్నము లిట్టివే కాబోలు! ఈ జన్మకు ఇక నెక్కడి దాంపత్య సుఖము. వివాహమై కూడ......అయ్యో, ఆ వివాహమే అట్లొక తీరునకు రాకుండినను, ఇరువుర మధ్య నయ్యెఖాతము అట్లే యుండిపోయినను ఇరువుర మును కొండొక మధురజీవనమే అనుభవించుచుండమా. ఇప్పుడు మాత్ర మటుచూచిన నా వంటి ధన్యురాం డెవరు లే.

అవతరించెనె చిర ఖ్యాతార్కచంద్రాది
రాడ్వంశగౌరవ రక్షకుండు
ఉద్భవించెనె వెండియును భారతక్షోణి
విక్రమార్కునివంటి చక్రవర్తి
జననమైనాడె భోజుని యోలగవుగోష్ఠి
మఱపించు రాజన్య మండనుండు
ప్రభవించి యున్నాడె బలవద్విజాపురా
ధిపు దాకి భంజించు దిగ్విజేత

కలిగెనే నేడుగా నవాబులయు గద్దె
లుద్ధరింపంగ హైందవయోద్ధ యౌర!
అట్టి నృపపుంగవునకు నర్ధాంగినైతి
నేది యెట్లున్న భాగ్యమే యింతకన్న.

( మందిరము వెలుపడ నద్యమించియూ బెదరినట్లు వెన్కకు వచ్చి )

ఒడలు భగ్గు మనుచున్నది. భాను డెంత మిడిసిపడు చున్నాడు. ప్రకృతిలోనే యున్నదిగా ఈ వ్యతికర ప్రకృతి!

జలములిడు మేఘుడే పిడుగులను ఁదుల్చు
మనువు నన్నంబె విషమించి మనుజు గూల్చు
లోకబాంధవు డీత డిట్లు తెగ గాల్చు
నకట! నిష్ఠురు లెంతసాత్త్వికులు గొంత.

అయినను వర్షోత్పత్తికి కారకుడైకదా ఇతడిట్లు నుడికించు చున్నాడు. మహనీయు లొకరిని తపింపజేయు టెల్లను అట్లు తపించువారి మంచికే యగునో? ఏమైన, ( **ఒడలు కంపించ నూర్పు రనుచు**) నివియేమి గాడ్పులు! తగిలినంతవట్టు దహించుకొని పోవుచున్నవి.

కాగిన పెన్మవేలె నిటు గన్గనలాడు మహీతలంబుపై
వేగెడు జొన్నలట్టులు తపింపక పోవునె జీవరాసు; ల
య్యో! గతియేమి, యింక బ్రదుకున్నదె యీగతి గాడ్పుజిచ్చులు
పోగయి గోరుచుట్టుపయి రోకటి పోటుగ దెబ్బతీసినన్.

**(ఆతురముతో మురళి ప్రవేశించును.)**

మురళి:

తల్లీ, ఏమి చెప్పను. సత్రశాల వెదకుచుగా బోలు-పాపము, వచ్చుచు వచ్చుచు గాడ్పు దెబ్బకు స్పృహ తప్పి గుఱ్ఱము మీదనే ఒరగినాడు.

అన్నపూర్ణ:

(**ఆతురముతో**) అయ్యో! లోని కింకను తెప్పింపలేదా?

మురళి:

చెప్పించుకొను వలకునా? పరిచర్యలు జరుగుచున్నవి గూడ. అగునో కాదో గాని అచ్చముగా మన......

అన్నపూర్ణ:
(చకితయై) ఏమది! రాయలవారటవే?

మురళి:
అవును—అట్లే యున్నది తల్లీ.

అన్నపూర్ణ:
ఏమిమాట. ఏదీ, చూతము రా. (సంభ్రమముతో బయలు దేరును. ఇరువురు నిష్క్రమింతురు.)

(తె ర వా లు ను)

# తృతీయ రంగము.

స్థలము—కంభముచెఱువు గట్టు.

(ప్రవేశము:— గుఱ్ఱము దిగి నీరు త్రావుటను అభినయించి త్రాపుచు తిమ్మరుసుమంత్రి.)

తిమ్మరుసు:

(స్వగతము) నూఱేండ్లును ఉన్నట్లేపో ఇక. వల దీ దగపెట్టు పగవానికైన. (గుఱ్ఱమునకు నీరు త్రాపుచు పాఱజూచి) ఏమది!

ఇంత తటాక మెన్నడొకొ యిచ్చట గంటిమి! మండు టెండలన్
కొంతకు గొంత యింకియును కొండొక యంబుధియట్ల యుండదే
సుంత శరీరపుం గృశత చొప్పడియున్ మహనీయు విస్తృత
స్వాంతమువోలె శాంతమయి సారగభీర రవప్రపూర్ణమై.

సీమయు మాదిగానే యున్నది. (క్షణమాలోచించి) ఓహో! రాచూరు దండయాత్రకు ముందు ఈ ప్రాంతీయులు కొందఱు వచ్చి చెఱువు కట్టించుకొంద మనిగదా ప్రస్తావించిరి. నిర్మాణ కుశలురైన బుడతకీచులను పరిశీలనార్థ మంపుడనియు ప్రార్థించి యుండరే. ఎంతలో తయారైనది. (అటు చూచి ప్రకాశముగా) ఓయీ జాలరులు! (చే సైగతో పిల్చుచు స్వగతము) బెదరు చూపులతో నక్కి నక్కి వచ్చుచున్నారేమి! చాటుమాటు బాపతులే కావలెనా ఈ చేపల వేటలును! (పిల్లల చెఱువుదెస చూడసాగును. ఒక వృద్ధుని ముందునకు నెట్టుకొంచు ఒక యువకుడు ప్రవేశించును.)

వృద్ధుడు:

(గిఱ్ఱున వెనుదిరిగి కోపముతో)

యేట్కి ముందరైతే యేమిట్కి ముందరేనా

నీట్కి ముందరైతె కాట్కి ముందరేనా

రామడీ. నా తలతీశి నీ తల తీశేల్లేదేమో సూతామ్ రా.

యువకుడు:

(మెల్లగా) అర్నాకు మామా. అరసాకు. ఎటూ సావ్ మూడిం దితే— (పకిక్కు-పకిక్కులగా రా సాగును)

వృద్ధుడు:

(అదురు గట్టువైచి ఆశ్చర్యముతో) పెబువులేరో!

తిమ్మరుసు:

(తిరిగి చూచి) ఏమిగోయి. అంత కంగారేల?

వృద్ధుడు:

దండాలండి దేవో! దండాలు. (చాగిఁబడును)

తిమ్మరుసు:

లేలే. ఏయూరు మీది?

వృద్ధుడు:

(లేచి) దరిమడుగు దేవరా.

యువకుడు:

ఛమించు సోములో. (దూరముననే చాగిలబడి లేచి) రోప

ట్పించి వొత్తే వొట్టు. (చేతులు జోడించి నిలబడును)

తిమ్మరుసు:

( మందహాసముతో ) ఎక్కడి దరిమడుగు — ఏమి సంగతి! అయినందుకైన నేటి కొక్కనాటికి క్షమింప కేమిగాని ఈ చెలు వెవరోయి త్రవ్వించినది?

వృద్ధుడు:

అన్నపున్నమ్మతల్లి దేవా్ర.

తిమ్మరుసు:

(తనలో) అన్నపూర్ణమ్మ కాబోలు. (పరిహాసముగా) ఎవరామె?

వృద్ధుడు:

యెవ్రో యేంది దేవరా. మా దేవతే. అంకాలమ్మతల్లి. పోతే రమ్మతల్లి. కాకుంటే యిం కొవురు సోములో. యీ సుట్టూపట్టు పదామళ్లైక్క జనాలందూ్ర అతల్లిపేరు శెప్పుకొంటా బతక్తుండారు గాదూ. మరిశిపోతి—మరిశిపోతి. ఆ సల్లనితల్లి సలవన్నే సక్కా పోతే సత్తర మొక్క లెలిశుండది. అదే లేకుంటే దిక్కుమాలి నోల్లకంతా దిక్కే దన్కాస్తార్ దేవా్ర.

తిమ్మరుసు:

ఏ యూ రామెది?

వృద్ధుడు:

యేవ్రైతే నేం దేవరా (ఒడలు గగుర్పొడువ) జెగితంతా తందే.

తిమ్మరుసు:

ఆమె యిట వచ్చి యెంతకాల మాయెనో?

వృద్ధుడు:

యెన్నో యేళ్లా. శిరిగిరి మల్లయ్య తిన్నాలకంతా సెరువై యిండె. తిన్నాల్ పోయె— తిన్నాలొచ్చె.

యువకుడు:

మూడేళ్లాయెలే దేవా. యీ ముదోన్కి మొంచుకు రాద్దాని, సత్తరం గట్టె గెట్టి రొండేళ్ళైతే—

తిమ్మరుసు:

పోనీగాని ఆమె వయస్సెపాటిది?

వృద్ధుడు:

వొగుసత్తల్లైనా, లగ్గనమయిందంటుర్గాని వెవ్వర్ నమ్మె ల్లేద్ దేవా. కన్నెక లుండేల్లేదేమ్?

తిమ్మరుసు:

(ఆశ్చర్యముతో తనలో) అగునా యేమి పుచీరాలు!

వృద్ధుడు:

యాలగాని సదుము కున్నోల్లకు యీ దేవో రాతిమీద రాశిండాల్నె.

తిమ్మరుసు:

ఏదీ. ఎక్కడనో చూడు.

వృద్ధుడు:

ఉండుండు దేవరో, నాయెంట రాండి సూపుతా, యెంటరాండి సూపుతా, మీ బంటునైతా బతుకుతా.

(నృత్యముతో రెండడుగులు వెంట గొనిపోవును)

తిమ్మరుసు

( వడచుచు గాడ్పు సోకు నభినయించి కంపముతో ) ఏమి వేడి గాడ్పు. నీటి పట్టున నిట్లున్నదే. మా రాయ లెట నున్నవాడో!

వృద్ధుడు:

ఇద్దిగ్గో దేవరో—(చూపును)

తిమ్మరుసు:

మంచిది మఱి మీరు పొండు పాపము.

(ఒక్క దుముకున యాంత్రికుడును 'శెలవ్, శెలవ్' అని పలుకుచు వృద్ధుడును నిష్క్రమింతురు )

తిమ్మరుసు:

"స్వస్తి శ్రీ శాలివాహనశక వర్షంబులు ౧౪౩౮ సిద్ధార్థినామ సంవత్సర వైశాఖ శు ౧౫ శుక్రవాసర శుభ సమయంబున శ్రీ విజయనగర పురవరాధీశ్వర మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ శ్రీ శ్రీ కృష్ణదేవరాయ చరణకమల సేవాతత్పర చిత్తయగు నొకానొక మానినీమణి యీ తటాక నిర్మాణ ప్రతిష్ఠ లొనర్చి యా ప్రభుసత్తమున కాయురారోగ్యైశ్వర్య యశోవైభవాభి వృద్ధ్యర్థమై పరమేశ్వరార్పణము కావించినది. శ్రీ శ్రీ శ్రీ.

( తల వంకించుచు కనుదోయి చెమ్మగిల్ల )

పుట్టింటి నగలెల్ల పెట్టి పంపమే. కొల్లబెట్టి కట్టించె గాబోలు. పేరు ప్రకటింప నొల్లని మా రాయల చరణదాసి మఱెవరు? — (గద్గదధ్వనితో) త్రిశంకుస్వర్గ మనుభవించు చున్నదిగా. హరిహరీ, ఎంత శీలవతి—ఎంతటి మానవతి! తనపేరుసైతము దాచుకొని తన పతిరాష్ట్రపు సరిహద్దుననే వసించి, తన్ను పరిత్యజించిన

పతిపేరనే ఇంత తటాకము కట్టించెనే. ఇటువంటి పునీతాత్మను ద్రోహశీలగా శంకింపజేసిన పరిస్థితుల వనవలెనా, లేక తెగతెంపు లతోగూడిన తీవ్రవాదని మా రాయల నందునా-ఎందుకు? నృపతి క్షేమదృష్ట్యా సాధ్వీద్రోహమునకైన వెనుకాడని నన్నే అనవలయును.

నిర్దోషిత్వము కారణముగా, నెక్కడ విరక్తి వహించి ప్రాయో పవేశాదుల పాల్పడునో అని వగచితిగాని ఉత్తమురాలికి, స్థితప్రజ్ఞు రాలికి అది లక్షణము గాదని నాకే కాదు — లోకమునకే ఎఱుగ జెప్పితివే. తల్లీ, ఎంత నిండుకుండవు. ఇట్లొక తటాకమేమి- అట్లొక సత్రశాలయేమి—దీనజనోద్ధరణవ్రత జీవనమున నిట గొండొక దేవత వైతివిగా! ఆహా! కావుననే కాబోలు 'అన్నపూర్ణా'హ్వయ విశేషము. ఎటుచూచిన సార్థకనామవు గదమ్మ. నిను గోల్పోయిన రాయలు సాంసారికమగు 'రుచి' గోల్పోయినవా డయి యుండడే!

ఇపు డీమెను చూచిన నేమనువాడో రాయలు? ఏమో అనుటే?—ఇంకను ఋజువులు కావలెగా- ఔరా, కృష్ణరాయా!

> ఎన్నివిధాల నీదు బ్రదుకిచ్చట రచ్చల కెక్కియుండునో;
> ఎన్నియొ నిన్ను దూఱుటలు; నెంతగ నే వినలేక యుందునో;
> ఇన్నివిధాలుగా జనము లింపఁగఁజే నిటు కన్నతల్లిగా
> నెన్నికగన్న యీామె పతి నేయొకయింపుక వెల్లడించుచో౯.

తోడ్కొనియే సత్రశాలకు పోవుదమనిన ఎందున్నవాడో — గాడ్పులకు వడదగిలి ఏమియైనాడో! విజయోల్లాస మంతయు నగపడ్డదిపో-ఏమైనను, ఇది నిజమేయైన రాచూరువంటి రాజ్య లక్ష్ముల దనద్రోల దిగదుడుపను పనికిరాకుండు ఈ సాక్షాల్లక్ష్మిం బడసెడు నేటివంటి శుభదినమా మఱి! ఆహా,

ప్రణయభంగ సువిస్మరణమే రణముగాగ
రాచూరు సాధింప లేచుటేమి
తలపెట్టి యెఱుగని కలబర్గి పర్యంత
జయపరంపర లొంపజాలుటేమి
నిర్గమించుచు నుండి నెఱవేడ్క యీ నల్ల
మల వేటకై బుద్ధి దొలుచుటేమి
ఏనతి కొట్టంబడ్డ విధమొప్ప నిచ్చోట
తేలి, యీ శుభవార్త దెలియు టేమి

ఎంత దవ్వురాక, ఎక్కడి కెక్కడ
దేనికేది—చిత్రమౌనుగాదె
త్రోసికొంచు నిట్లె తత్తెంచు నొండొంటి
గలిసివచ్చునట్టి కాలమందు.

చివరకు ఈ యూహాస్వప్నసౌధము ఏమి కానున్నదో!
(నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

# చతుర్థ రంగము.

---

స్థలము—సత్రశాలాంతరము.

(సెజ్జపై రాయలు మూర్ఛితుడై పడియుండును. పరిచారికలు చుట్టును సంభ్రమముతో మూగియుందురు అయన మొగముపై కొంచెము కొంచెముగా నీరు చల్లుచు అన్నపూర్ణాదేవి పరిచరించు చుండును)

అన్నపూర్ణ:

ఇంతసేపటి కింకను ... ... దైవమా! చివర కిదియేమి ప్రదర్శింప నెంచితివి!!

మురళి:

(రాయల చేయిపట్టి చూచి) నాడికూడ చక్కబడినది. ఇకేమంత భయములేదు లెండు.

అన్నపూర్ణ:

(ఒక పరిచారిక చేతినుండి సురటి గైకొని విసరుచు) తొలగుడు—మీ రందఱు చుట్టు నుండకుడు. గాలి ధారాళముగా రానిండు. (మురళితో) మురళీ, లేచువేళ కిచ్చుటకు చల్లనీరు, నిమ్మరసము సిద్ధపఱచి యుంచుము—పొమ్ము.

(చేసైగతో అందఱను పిల్చికొని మురళి నిష్క్రమించును.)

అన్నపూర్ణ:

(పాదములొత్తుచు కన్నులు చెమ్మగిల్ల) నాభాగ్యమే వీరినిట్లు త్రోసి

కొని వచ్చినది. చాలు: (అటునిటుచూచి) నాజన్మ కీపాటి సార్థకత చాలు.

(రాయలించుక కదలి కన్నెత్తి చూచును. అన్నపూర్ణాదేవి లేచి పోసాగును.)

రాయలు:

(తేఱిచూచి) ఎవరు?

(అన్నపూర్ణాదేవి నిష్క్రమించును)

రాయలు:

(ప్రక్కకొత్తిగిలి) ఏదీ- పోయెనా? ఎవరు వీరు! మాగుఱ్ఱ మెక్కడ!!

(సంభ్రమముతో మురళి ప్రవేశించును)

మురళి:

రాజేంద్రా, గుఱ్ఱమెక్కడకు పోలేదు. ముందు తామీ చల్ల నీరు పుచ్చుకొందురు- (రజతపాత్ర నందిచ్చును)

రాయలు:

(త్రాగి త్రిప్పుచు) నీవెవరు?

మురళి:

ప్రభూ. నే నిచ్చటి పరిచారికను.

రాయలు:

ఈ యావాస మెవరిది?

మురళి:

అన్నపూర్ణాదేవిగారి సత్రశాల.

రాయలు:

ఎవరు వారు?

మురళి:

ఇప్పుడే తమకు పరిచర్యచేసి పోయిరిగదా- వారే.

రాయలు:

ఆం! ఆ దివ్యమంగళ విగ్రహము నెపుడో చూచినట్లున్నది. ఐనను మేమిచ్చటి కెట్లు వచ్చితిమి, ఏంతలుగా నున్నవే!

మురళి:

వేటలో దప్పిగొంటిరి గాబోలు- దైవికముగా ఈవైపే వచ్చుచుంటిరి. వేడిగాడ్పు వేసినది- మేమటు చూచుచుండగనే వడ దగిలి మూర్ఛిల్లితిరి.

రాయలు:

కలవలెగదా సర్వము కన్పట్టుచున్నది. అదెక్కడి దప్పిక- అదేమి తాపము. పైగా, అవి గాడ్పులు గాడ్పులు కావాయెను. ఎవరో ఇటనొక సత్రమున్నదన విని మేమును...అయినను ఇంత నీటిగొట్టుగా ఈ నల్లమల పొలము! తగినచో లెక్కిగి ధర్మసత్రమిట్లుకట్టించిన మీ యజమానురాలిదిపో పుణ్యము. (**అటునిటు చూచి విస్మయముతో**) ఇవియేమి! మా రూపచిత్రములా!!!

మురళి:

ఔను. చిత్రకళలో దేవిగారు ఎంతనేర్పరులైనది దేవరవారి దర్శనభాగ్యముచే ఇప్పుడుగదా మాకు తేటపడినది.

రాయలు:

అహెూ, మఱి వారి వృత్తాంతము సాంతము విన్పింపకనే పోయితివి.

మురళి:

మే మేమి చెప్పగలము ప్రభో.

రాయలు:

ఇక చెప్పగలిగన దెవరని?

మురళి:

తామేయని

రాయలు:

అనగా? మా కర్థము గాలేదు.

మురళి:

(చిఱునవ్వుతో) మా కర్థమైనది లెండు. ఎవరే కానిండు — దయదలచి చెప్పిననే సరిపోయెగాని మఱిమఱి అడుగుటకు మా కెక్కడ నరేంద్రా. ఎఱిగిన వఱకును ఏల చెప్పముగాని వారీ చేరువనే ఒక తటాకము త్రవ్వించియు, ఇచట ఈ సత్రశాల నెల కొల్పియు ఈ ప్రాంతమువారి పాలిటి కొక దేవతగానుండి దీన జనులకు దిక్కయినారు ప్రభో.

రాయలు:

ఇదిగాక యొక తటాకమే! ఎక్కడివారో అసలు వీరు?

మురళి:

అంతుతేలని గొడవలలో అదికూడ ఒకటి.

రాయలు:

పోనీ. తా నిటవచ్చి ఎంతకాల మాయెను? అట గూర్చుండు. నీ పేరేమి?

మురళి:

అక్క అలేదులెండు. వారువచ్చి దాదాపు మూడేండ్లయినది.

రాయలు:

పేరు చెప్పుటయు పెద్ద తప్పులలో ఒకటేనా?

మురళి:

(శిఱునవ్వుతో తలవంచుచు) మురళి.

రాయలు:

మురళి పలుకులు ముద్దుగొలుప కెట్లుండును. తగుదువు గాని మురళీ, ఈ సేవావ్రతమున భాగస్వామి యొకడున్నట్లు గోచరింపదు. మొద లీమెచే అట్టి యవకాశము ఒకని కనుగ్రహింపబడనట్లేనా? లేక......

మురళి:

మెడలో పసపుదారము లేకున్న అదికూడ సందేహమే అయ్యేడిది.

రాయలు:

వివాహితయునా? అయి?

మురళి:

అగునట, కాని,

రాయలు:

(స్వగతము) గజపతి నందన కాదుగదా. పాపశంక పరిహరింప బడుగాత. (ప్రకాశముగా) ఎక్కడలేని ఆకర్షణ సుమా ఈ కానీలకు!

మురళి:

తమకా ఒకరు చెప్పవలయును. అయినను ఆలోచనలో పడితిరేమి.

రాయలు:

ఔను మురళీ.

ఈ మహిత వ్రతధారిణి
తో మధుర ప్రణయపూర్ణతో రూపసితో
నేమిటికి భర్త బెడిసెనొ
ఏమైనను అట దొలంగు టీమెకు నేలో!

అని ఆలోచించుచున్నాను.

మురళి:

పురుష పక్షపాతమే మొగ్గుచూపెగదా. జరిగినదని పడువారికేది కారణము గాదు ప్రభువరా. మా కింతకు నొకటి తెలియకున్నను మాటవరుస కిట్లనుటను క్షమింతురుగాక. పతు లట్లు పరిత్యాగ రూపకమైన మహావమానము పాలు చేయునపుడు ఎంత ముగ్ధలైనను మానినీమణులు ఎట్లచట నిలువగలవారు? ప్రేముడి యెంత మితిమీఱియున్నను పంచ గఱచుకొని పడియుండవలెనా. అది వారి దురదృష్టము గాకున్న అట్టి పతు లసలు సంప్రాప్తింపరు లెండు. అందఱును తమవంటివారే అనుకొను చుంటిరా? ఎంత అలసి వచ్చితిరో, ఉండుడు— మఱికొంచెము పానీయము...

(నిష్క్రమించుచు)

రాయలు:

(గుఱ్ఱములో తెలివితేని చూచుచు) ప్రత్యక్షముగా ప్రత్యక్షరమున బొడిచినట్లగు ఈ దెప్పులేమి- తనలో పాతకట్టి నట్లున్న పాద్భ్యపు చొప్పులేమి!- కడ కీ చిత్ర కళానైపుణ్యము తానే యనుటకు తార్కాణ గాదా? కేవలమును రాజభక్తి కింత ప్రాధాన్యమిచ్చు మగనాండ్రుం గలరుగా! కాగా నిర్దోషియా?- అయిన నింకేమి ఎంతవెఱ్ఱి! మొదటికి తానైయున్నప్పటి ముచ్చట.

(మురళి ప్రవేశించి రజతపాత్రలో తడి జల మందిచ్చును)

రాయలు:

(తాగి తేపుచు) ఇంత లుపన్యసించితివి గాని త్యజనకారణ మింతకు తెలియ రాదాయెను. పోనీ, కారణము గాకున్న కర్తనైన -దురదృష్టవంతుడగు తద్భర్తనైన తెలుపవేమిటికి? అయ్యో మురళీ, ఏమైన నిట నిలబడి, ఎంతకైనను పాల్పడి ఈ ఫయాను కూల్యము ఘటంతుననియే తలంపుము. ఘటించి ఋణ విముక్తుడ నగుదు ననియే విశ్వసింపుము.

మురళి:

నిజమే అనుడు. అదిగాని ఇదిగాని ఎవ రెఱిగియుండిరి ప్రభో. కాకున్న నంత నిరంకుశులు ప్రభువులే కాబోలు ననుకొనువఱకే గాని. అట్టివారి పేరు ఎఱిగియున్న మాత్రము ఎవ రుచ్చరింతురు లెండు.

తెరలో

మురళీ, ఇటురా.

మురళి:

(ఉలిక్కిపడి) అమ్మగారు పిల్చుచున్నారు. సెలవియ్యవలెను.

రాయలు:

ఏ పరిచారికలో లెమ్ము. వా రేలపిల్తురు.

మురళి:

కాదు ప్రభో. అవశ్యము వారే.

రాయలు:

ఏమిమాట గాని నన్నింత ఋణవిముక్తి చేసికోనిచ్చెదవా లేదా?

తెరలో మాటల

మురళి, రావా యిటు.

మురళి:

చూచితిరా. నాకు మాట దెచ్చితిరి.

(కలవరముతో నిష్క్రమించును)

రాయలు:

కంఠస్వర మదియే సుమా. ఇంకేటి సందియము. ఈ పరిచారికలకును నాపై ననుమాన మున్నది. కాని, తేటగా తెలిసియే యున్న, లేక తా నేమాత్రము తెలియనిచ్చి యున్నను ఈ పాటి చీవాట్లతో తీఱడిదా వీసపని! (గద్గదధ్వనితో) అయ్యో. నాకై యపకీర్తిదాయక మని యెంచి, లోకులలో నా తప్పిదము కప్పిపుచ్చి, రాజభక్తి నెపం బిడి పతిభక్తిప్రపత్తితో కాలముగడపుచున్నది గదా. ఈ యవివేకపు హతభాగ్యునకును భాగ్యలక్ష్మి ఇల్లేదుర్పడునే. నిర్దోష గాకున్న ఈ తిప్పలేల. 'బ్రదుకు జీవుడా' అని పుట్టింట పీతమిడ కుండెనా. సిగ్గు సిగ్గు. ఆప్రాజి

యొకవంక ఆగు మనుచున్నను, ప్రణయ లోకమునకే దూర మైతి వని అంతరాత్మయు నొకవంక ప్రబోధించు చున్నను వినక, వినిపించుకొనక నేనుచేసిన దంత యెంత ద్రోహమా. (క్షణమాగి) మొగమెట్లు చూపుదును. ఎఱుగనట్టే యింటికి పోదునా, అటుమీదట అప్పాజి యున్నాడన్నట్లు. అయ్యో, అయ్యో, ఎట్లు వదలి పోగలను. (మురళి ప్రవేశించును.)

మురళి:

ఆకాలి మైనది. దేవరవారు స్నానార్థము విచ్చేయ వలెను.

రాయలు:

ఏల? ఆతిథ్య మిత్తురా?

మురళి:

శక్తి కొలది. అయిన నేమి, కైకొన రాదనియా?

రాయలు:

లేదులేదు. అందుకేమి. కన్నుల కద్దుకొని గదా కైకొందుము. కాని, నీకు తెలియని దేమున్నది. మురళీ, ప్రేమ భాషలు లేని పెట్టుపోత లెవరికి రుచించును. పోనిమ్ము. అది తలపోయుటయును ఏటిమర్యాద!

మురళి:

(సంకోచముతో) పరపురుషులతో భాషించుట మాత్రము మానినీమణులకు మరియాదయా సరేందా, అదిమాత్రము గమనింపవద్దా.

రాయలు:

(దరస్మితుడై తల పంకించుచు). పశ్చాత్తప్తుడై పతియే వచ్చినను

వానితోమాత్ర మేటిమాట లనుదానవు సుమా నీవు. నీ మాటల కేమిగాని నా ప్రాణదాత నొకసారి దర్శనమిచ్చి పొమ్మనవా. నా కృతజ్ఞత తెల్పుకోనీవా?

మురళి:

క్షమింపుడు మహాప్రభో. నడుమ నాదేమున్నది, పోయి మనవి చేయుదును. (నవ్వుచు పోసాగును)

రాయలు:

మురళి, ఇటురా. పోవునపుడు మఱల మాకు జ్ఞాపకముండునో లేదో. మీ సత్రశాల కిదిగో మా కానుక.

(మెడనుండి తీసి యిచ్చును)

మురళి:

మహాప్రసాదము. (పుచ్చుకొని పోసాగును.

వేఱొక పరిచారిక ప్రవేశించును.)

పరిచారిక:

(బింకిర మురళి వెనుకవచ్చి గుసగుస మాటలుగా) తిమ్మరుసటనే దేవిగారిని దర్శన మిమ్మని కోరుచున్నారు.

మురళి:

చాలు రావే. చెప్పనది చెవిలో నయ్యెను కొందఱి కంఠధ్వని కొండెక్కి కూయునేమి. (నెట్టుకొనుచు నిష్క్రమించును.)

రాయలు:

(ఒడలెల్ల చెవులుగా వినుటచే ఉప్పొంగిపోవుచు) అప్పాజియా! ఏమి నాభాగ్యము. నన్ను వెదకుచు వచ్చెగాబోలు. సమయము

నను రానే వచ్చెగదా అహా, శుభపరంపర! ఎదురువోయి సర్వము నివేదించెదను. (ఎల్లరకు నిష్క్రమించును. పరిచారికా సహిత ముగా అన్నపూర్ణాదేవి ప్రవేశించును)

అన్నపూర్ణ:

నడుమ తెరగట్టు మురళీ, త్వరగా.

మురళి:

(కట్టుచు) దర్శన మిమ్మనిగదా అతిథుల కోరిక. తెరగట్టిన?

అన్నపూర్ణ:

కట్టవే. ఆ ధన్యాత్ముల కీ పాపాత్మురాలిమొగ మేల చూపవలయు లెమ్ము. కట్టుము.

మురళి:

(కట్టితొలగించుచు) మనవారేగదా. తల్లీ. ఇంకను దాచెదరా?

అన్నపూర్ణ:

మనవారు కానిదెవరు? వెఱ్ఱిదానా. వచ్చుచుందురుగాబోలు. ఉదాత్తరీతి దోడ్తెచ్చి ఆసీనుల గావించి నేనిట్లు ఈవల నుంటినని విన్నవించి నీ వచటనే పరిచరించు చుండుము. పొమ్ము.

(చెవి గిల్లుకొనుచు మురళియూ ప్రక్కన పరి చారికలతో నిష్క్రమించును)

అన్నపూర్ణ:

(హారము తీసి చూచుకొనుచు) కొండవీటి పురోహితునకు గదా నే నిచ్చినది. ఇది దొరికించుకొన్నవారు నాయెద దొరికించుకొన

కుండిరా. కాగా నా డేర్పడని విశ్వాసము నేడుమాత్ర మేర్పడు నని ఏమినమ్మకము. ఆటుచూచిన పుట్టింటి పూసతోగూడ నన్ను తరలించినవారు ఇదిమాత్ర మేల యుంచుకొన్నారో. ఏమిదైవమా? దైవము సంగతి యెఱుగమా. (గద్గదధ్వనితో) అయ్యో! ఎందుల కిట్టు లొనగూర్చుచున్నదో సుమా. (చాపపై చతికిల బడును. తెర కావల మురళి వెంట మంత్రి పురస్సరముగా రాజులు ప్రవేశించును)

మురళి:

ఇటు దయచేయు డార్యులు. ఈ యాసనము లలంకరింపుడు. (కూర్చుండిన అతిథులతో మురళి వెంట సాగును)

తిమ్మరుసు:

దేవిగా రేమిచేయు చున్నారు?

మురళి:

తెర కావల నున్నారు. వచ్చినపని సెలవియ్యవచ్చు ననుచున్నారు.

తిమ్మరుసు:

మంచిది. నీ వీ వాకిలివేసి అచటనేయుండి లోని కెవ్వరిని రానియ్యకుము—పొమ్ము.

మురళి:

చిత్తము. (నిష్క్రమించును)

తిమ్మరుసు:

తల్లీ.

అన్నపూర్ణ:

(గద్గదస్వరముతో) తండ్రీ.

తిమ్మరుసు:

నీవు నాకు తల్లివి కావా?

అన్నపూర్ణ:

కాదు. మీరే నాకు తండ్రులు. కాని, రాజమర్యాద గదా.

తిమ్మరుసు:

మర్యాద లెట్లున్నను అయ్యదియే నిజమగునేని ఇయ్యావ రోధమేల (ఖడ్గముతో ఛేదించుకొని ఇవతలకు వచ్చి) తల్లీ. విచ్చేయవలెను.

అన్నపూర్ణ:

(తలవంచుకొని) ఎక్కడికి తండ్రీ.

తిమ్మరుసు:

విజయనగరికి.

అన్నపూర్ణ:

(ఉలిక్కిపడి) ఈ దీనురాలికా? అంత సన్మానమా? తండ్రీ. నే నర్హురాలనా—అయ్యో, నే నర్హురాలనా!

తిమ్మరుసు:

(కన్నీరు చొటుచొటు రాల) నిరపరాధివి నిన్నింత......

అన్నపూర్ణ:

(తేఱిచూచి) నిరపరాధిని! ఎవ రందురు?

తిమ్మరుసు:

ఎవ రనకుందురు తల్లీ. నీయట్టి పరమసాధ్వీ మతల్లికై పలుకు మనిన పంచభూతములే పలికిపోవా సాక్ష్యము! అమ్మా. అందాకేల. నీపతి–నీతోడిదే లోకముగా నెంచి నిన్ను పెండ్లాడిన నీపతి—నిన్నెడబాసిన నిముసముతోనే నిజమునకు సన్యాసియై పోయిన నీపతి—పరిశోధనప్రాయముగా నిన్నట్లు సాగనంప సాహసించిన నీపతి (రమ్మని చేసైగచేసి రాయలను ఆమె చేరువ నిల్చుండబెట్టి) ఇప్పు డింతకు నీ నిర్దోషిత్వముదెస నొందిన సందేహము వీడి, నీ విశుద్ధ ప్రణయ పరిధవ మీక్షించి, నీ పాతివ్రత్య ప్రకర్ష కబ్బురపడి, నిన్ను బెట్టిన హింసకు పశ్చాత్తప్తుడై తా నిపుడొక యపరాధి వోలె అటమటించుచు లజ్జతో నెట్లొదిగి నీకడ నిలిచియున్నాడో మోమెత్తి యటుచూడు.

అన్నపూర్ణ:

(హాస్తద్వయమున మొగము కప్పుకొని గద్గదస్వరముతో) చూడలేను తండ్రీ, ఈ దౌర్భాగ్యపు మొగ మాయనకు చూపుకో లేను.

(వెక్కి–వెక్కి ఏడ్చును)

రాయలు:

(ఎదుటికివచ్చి కన్నీరు కాల్వలుగట్ట) దేవి, (ఆమె రెండు చేతులు బట్టుకొని) క్షమింపవా?

అన్నపూర్ణ:

(తుల్లిపడి) ఎంతమాట! నాథా. (రాయుల పాదములపై

బడిపోవును.)

రాయలు:

కోరి ఈ క్రూరుని గట్టుకొన్నందుకు ఎంత సుఖపడితివి తరుణీ, (కన్నీరు జాలువారు లేవనెత్తి భుజమున చేర్చుకొని గద్గదస్వరముతో) బాలయోగినీ, నా జీవితేశ్వరీ (శిరము మూర్కొనసాగును. ఇరువుర కన్నీరు ఏకమై ఇద్దఱ నొక్కట తాన మాడించును.)

తిమ్మరుసు:

(ఆనంద బాష్పములతో)

సర్వ సన్న్యాసవృత్తికి సతిని దెచ్చి
ప్రణయ సన్న్యాసి గావించి పతి నలంచి
తలవని తలంపుగా నిట్లు దంపతులను
కలుపనేర్చిన విధివంటి చిలిపి గలదె.

రాయలు:

(అలకలు చక్కదిద్దుచు గద్గదస్వరముతో)

నిన్నుఁ బెండ్లాడగ ప్రాకులాడితినిగానీ నీవు నాదానవం
చనుకో నేర్చితినే పరిస్థితులు నా డట్లుండె; నెట్టైన సా
ధ్వని నిన్నింతగ గష్టపెట్టితి; ధరిత్రిన్ సత్యసంకల్ప వీ
వనరాదే గతమింతటన్ మఱచిపోవా నన్ను మన్నింపవా.

రుచిదేవి:

(తలవంచియే) ఈ మాటతో ఇప్పుడు నన్ను కష్టపెట్టుచుంటి రింతియకాని మీరుమాత్రము అప్పుడు చేసిన తప్పిద మేమున్నది. అవియెల్ల నాదుర్దినముల మహిమ గాకున్న ఎట్లు లభ్యపడినదో గాని ఈ హారమైన మీకు నా మన సెఱుగ జెప్ప దాయె గదా.

(చేతనున్న హారము చూపును)

రాయలు:

చెప్పినదియు నిజమే. చెప్పుచునే నను మఱంత సందిగ్ధతలో బడగుప్పినదియు నిదియేయని చెప్పకతప్పదు ప్రేయసీ. మెఱపు లోకపంక కనులు మిఱుమిట్లు గొలుపు చున్నను తోడనే చీకట్లుకూడ దట్టమై తోచుగదా. ఇప్పటికిని నిరంకుశులై తమ దెస పతులొనర్చు నపచార పరంపరను క్షమావతులు సతులౌ గాబట్టి ... ...

తిమ్మరుసు:

మాతుగాక యిక బ్రియాణ సన్నాహము (పోవుచును)

రుచీదేవి:

(చకితయై అటు చూచుచు) ఆ నోము నోచియుంటినే ఆర్యా, వలదు వలదు. నిర్దోష ననిపించుకొన్నదే నిజమగునేని నా కిక నేమి కావలెను. నా జన్మ తరింపలేదా. కాపురము చేయ నోచితిగా! విజయనగరికా? ఏ మొగము పెట్టుకొని?

రాయలు:

(ఆమె కడ్డము పట్టుకొని) సుందరీ, నన్నెందు కింకను ... ...
(తదేక దృక్కులతో పరికించిన పెండ్లియు సఫలమును గావించిన పాతాళ దశుచు తిమ్మరుసును దెస చూచి) అక్కఱలేదు. అప్పాజీ, నేను నిందే నిల్చి పోయెదను. ఈ దంపతులపొత్తు చూపోపని విధియు మే మచటికి వచ్చులోపల ఎట్టి విఘ్నమై నిలుచునో—కావున

చిర తపఃఫల పరిపాక సిద్ధమైన
ష్త్రీయ రాజ్యంబు ముం దేటి రాజ్యమనఘ,
దాని సటు మీ కొసంగితి దయ బరిగ్ర
హింపుడీ నా కృతజ్ఞత కిది గుఱుతుగ,

నెఱమరసినచో నేను దానిని మీకొసగితి ననుటయు పరిహా సాస్పదమే. అటులయ్యును అప్పాజీ. ఇదె నా కడపటి వేడికోలు

తిమ్మరుసు:

అయ్యో. అయ్యో. వింటివిగదా. తల్లి. అంతపనియు జరుగ నిత్తువా. (ఇద్దఱిని కౌగిలించుకొనును.)

(తెర వ్రాలును)

సమాప్తము.

---

జమీన్ రైతు పవర్ ప్రెస్—నెల్లూరు.